# మిసిమి

"All that we are is the product of what we have thought" is "We are what we think." — Dammapada.

సంపుటి 7 జనవరి 1996

సంపాదకుడు : డాక్టర్ రవీంద్రనాథ్

## విషయసూచిక


అంతర్జాతీయ మార్కెట్‌లో
అంగడి బొమ్మల గిరాకి

అత్తలు పురాణం సుబ్రహ్మణ్య శర్మ

గాంధారి -ప్రొ. శ్రీమతి ఇరావతీ కర్వే

ఉయ్యాల వాడ నరసింహారెడ్డి - జానమద్ది హనుమచ్ఛాస్త్రి

యయాతి - అవార్డు గ్రహీత ఖండేకర్

కలాన్ని కత్తి చేసిన ... - జర్నలిస్టు డేనియల్ డిఫో

మానవత్వం పెంచే సౌందర్యానుభూతి - డా॥ తక్కోలు మాచిరెడ్డి

మనోహర రసలేఖలు - జోగినాయుడు
అబ్దుల్ రహమాన్ చుగ్‌తాయ్

ధ్వని - పుట్ల మురళీరావు


Printed, Published and Edited by RAVINDRANATH ALAPATI at Kala Jyothi Process Ltd., 1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7612436, 7612337.

Editorial Nest

Plot No: 337 A, Road No. 10, Jubilee Hills, Hyderabad - 500 033. Ph. 247717.

# ముఖచిత్రం

Mind precedes all knowables,
mind's their chief, mind-made are they.
If with a corrupted mind
one should either speak or act
dukkha follows caused by that,
as does the wheel the ox's hoof.

*Courtesy "The Treasury of Truth (Dhammapada)"*

అన్నిటికి అగ్రగామి మనసే
మనసే సర్వం మనసే ముఖ్యం
చెడు మనస్సుతో పలికిన పలుకులు
చేసిన చేతలు చిరుదుఃఖాలై
ఎద్దుల గిట్టల వెంబడి వచ్చే
బండి చక్రముల వలె వెన్నంటును

దమ్మపద తర్జుమా - డా॥ గజ్జెల మల్లారెడ్డి

# అంతర్జాతీయ మార్కెట్‌లో
# అంగడి బొమ్మల గిరా:

సేకరణ: పోలంకి సత్యంM

తెల్లవారి సామ్రాజ్యం అంతరించింది, నల్లవారి బానిసత్వమూ, వెట్టిచాకిరీ నశించాయి అని చదువుతూ ఉంటాము, ఆ మాటలు నిజమే ననుకుంటూ ఉంటాము. కానీ తెల్లవారికి మిగిలినవారు బానిసలుగా ఉండడం మరో రూపంలో కొనసాగుతున్న దన్న విషయం మనని విషాదంతో కూడిన ఆశ్చర్యంలో ముంచివేస్తుంది. స్వతంత్ర దేశాలుగా చెలామణీ అవుతున్న అనేక దేశాలలో లక్షలాది మహిళలనూ, బాలికలనూ మోసగించో, అపహరించో, బలాత్కరించో, అమ్మివేసో వేశ్యలుగా మారుస్తున్నారు. ఈ స్త్రీలెవరూ ఇష్టంగా వేశ్యావృత్తిని స్వీకరించినవారు కాదు. ఒక దేశం ఎంత దరిద్రరేఖకు క్రిందగా ఉంటే, ఆ దేశంలో వేశ్యావాటికలలో బందీలయ్యే స్త్రీల సంఖ్య అంతగా ఎక్కువ.

అంతర్జాతీయంగా సాగే ఆర్గనైజ్‌డ్ వ్యభిచారానికి అనేక కారణాలు చెప్పుకోవచ్చు. వర్ధమాన దేశాలలోని దారిద్ర్యం, అభివృద్ధి చెందిన దేశాల ఆర్థిక పెరుగుదల విధానాలూ స్త్రీలను ఎగుమతి చేసి, కట్టు బానిసలుగా మార్చడానికి అనువయిన చట్టాలు ముఖ్య కారణాలు. ప్రపంచ మంతటా ఉన్న పితృస్వామ్య వ్యవస్థ మగవారికి ప్రత్యేక లైంగిక హక్కులను ఇస్తున్నది. అయితే అంతర్జాతీయంగా సాగే వ్యభిచారానికి కారణాలు బలవత్తరమైనప్పటికీ, కొన్ని ఆశాకిరణాలు కూడా కన్పిస్తున్నాయి. వర్ధమాన దేశాలలోని, ధనిక దేశాలలోని స్త్రీలు ఈ దయనీయ పరిస్థితి వెనుక నున్న అంతర్జాతీయ రాజకీయాలను పరిశీలిస్తున్నారు. ప్రపంచబాంకు, అంతర్జాతీయ ఆర్థిక సంస్థలు ప్రవేశపెడుతున్న పెరుగుదల విధానాలకీ, కెన్యా, ఇండియా, నేపాల్, బంగ్లాదేశ్, థాయిలాండ్, ఫిలిప్పిన్స్, బ్రెజిల్, హోండురస్ వంటి దేశాలలోని బాలికల దుఃఖపూరిత అనుభవాలకీ మధ్య గల సంబంధాన్ని వెలికితీస్తున్నారు. బలవంతంగా వేశ్యావృత్తిలోకి దింప బడిన స్త్రీలకూ, బాలికలకూ సహాయం చేస్తున్నారు. స్త్రీ ఉద్యమ కారిణులు వ్యభిచారాన్ని అంతర్జాతీయ పరిశ్రమగా మారుస్తున్న చట్టాలనూ, విధానాలనూ అంతమొందించడానికి ప్రయత్నిస్తున్నారు.

ప్రతి ఏటా కొన్ని వేల మంది చదువురాని అనాథ బాలికలను ఉద్యోగాలు ఇప్పిస్తామన్న ఆశతో వంచించి, తీసుకునిపోయి బొంబాయి నుంచి అటు బాంగ్‌కాక్ దాకా, ఇటు నైరోబీ దాకా ఉన్న అనేక నగరాలలోని వేశ్యావాటికలకు అమ్మి వేస్తున్నారు. రైల్వేస్టేషన్లలో, పల్లెలలో, పట్టణ వీథులలో అమాయక స్త్రీలకోసం గాలింపు అనుక్షణం జరుగుతూనే ఉంది. పాకిస్తానులోని మానవ హక్కుల కమిషన్ 1991లో బలవంతంగా వేశ్యావృత్తిలోకి దింపబడిన బంగ్లాదేశ్ స్త్రీలు రెండు లక్షల దాకా ఉన్నారని అంచనా వేసింది కానీ, ఆ సంవత్సరం ప్రభుత్వం ఎవరినీ నిర్బంధించడం కానీ, శిక్షించడం కానీ చెయ్యలేదు. నిర్బంధించడమంటూ జరిగితే అది చట్ట విరుద్ధంగా దేశంలో ప్రవేశించారన్న కారణంగా స్త్రీలనే నిర్బంధిస్తారు.

## ఢిల్లీ ఒక సూపర్ మార్కెట్ :

దక్షిణ ఆసియాలో అంతర్జాతీయంగా స్త్రీల కొనుగోలూ, అమ్మకమూ ఢిల్లీలో ఎక్కువగా జరుగుతోంది. బొంబాయిలో లక్షమంది దాకా వేశ్య లున్నారని అంచనా ఉద్యోగ మిప్పిస్తామనో, పని చూపిస్తామనో, వివాహం చేసుకుంటామనో మాయ మాటలు చెప్పి స్త్రీలను తీసుకుని వచ్చి అమ్మివేస్తారు వ్యభిచార వృత్తిలోకి దింపబడ్డామని వారికి తెలిసే సరికి ఆలస్యమై పోతుంది. సిగ్గుతో, భయంతో, తిండికీ, బట్టకీ వేశ్యావాటికల యజమానులపై ఆధారపడడంతో చితికి పోయిన స్త్రీలు తప్పించుకోలేరు. ఒక వేళ తప్పించుకున్నప్పటికీ, ఈ పతితలను వారి కుటుంబ సభ్యులు ఇంటికి రానివ్వరు.

ఈ స్త్రీల పరిస్థితి అతి నికృష్టంగా ఉంటుంది. ప్రపంచ ఆరోగ్య సంస్థ అంచనా ప్రకారం బొంబాయిలోని వేశ్యలలో మూడవవంతు ఎయిడ్స్ వ్యాధితో బాధ పడుతున్నారు. వ్యాధిగ్రస్తులైన స్త్రీలకు వైద్యం చేయించకుండా బయటకు పంపివేస్తారు. ఏ వ్యాధీ లేనప్పటికీ నలభై సంవత్సరాలు నిండిన స్త్రీలను వేశ్యావాటికల యజమానులు ఉండనీయరు. వారు బిచ్చమెత్తో, దొంగతనం చేసో బతక వలసిందే. చాలా మంది అకాల మృత్యువు పాలవుతారు.

ప్రభుత్వమే చేబట్టిన శృంగార పర్యటనలు అంతర్జాతీయ వ్యభిచారంలో ప్రముఖ స్థానాన్ని ఆక్రమిస్తున్నాయి. థాయిలాండ్‌ని ఇటువంటి పర్యటనలకు ఉదాహరణగా చెప్పుకోవచ్చు. స్త్రీలకు సిగ్గు ఆభరణమన్న సంస్కృతి థాయిలాండ్ పల్లెలలో ఉంది. అటువంటి పల్లెలనుంచి అమ్మాయిలను బలవంతంగా తీసుకొచ్చి, బాంగ్‌కాక్‌లోని బార్‌లలో అతి తక్కువ దుస్తులతో నాట్యం చేయిస్తారు. అమ్మాయిల దుస్తులపై అంకె లుంటాయి. బార్‌లకు వచ్చిన పురుషులు తమకు నచ్చిన డ్రింకులతో పాటు అమ్మాయిలనీ ఎంచుకుని, అంకెతో ఆర్డర్ ఇవ్వవచ్చును. చియాంగ్‌మాయ్‌లోని వేశ్యావాటికలో అద్దాల కిటికీ వెనుక అమ్మాయిలు కూర్చుని ఉంటారు. ప్రతి అమ్మాయి జాకెట్టుకీ ఆమెతో అరగంట గడపడానికయ్యే ధర ఉన్న చీటీ హృదయాకారంలో కుట్టబడి ఉంటుంది. ఒక్కొక్క ఆమె రోజుకి పది నుంచి ఇరవై దాకా విటులను సంతోషపెట్టవలసి ఉంటుంది. ఈ వేశ్యావాటికలో ప్రతి అయిదుగురిలో నలుగురికి ఎయిడ్స్‌వ్యాధి ఉంది. ఖరీదైన వేశ్యావాటికలలో కూడా అయిదుగురిలో ఒక్కరికైనా ఎయిడ్స్‌వ్యాధి ఉంటోంది.

ఇటువంటి భయానక పరిస్థితు లున్నప్పటికీ థాయిలాండ్ ప్రభుత్వం తమ దేశంలోని బార్‌లను గురించీ, వేశ్యావాటికల గురించీ ఆకర్షణీయంగా ప్రకటిస్తూనే ఉంది. జపాన్, జర్మనీ, నార్వే, సౌదీ అరేబియా, హాలండ్, ఆస్ట్రేలియా, అమెరికాలలోని వ్యాపారస్థుల పర్యటనలను పెంపొందించే ప్రయత్నమే ఈ ప్రకటనలు. స్వగృహాలనుంచి దూరంగా ఉన్న విదేశీ విటులకు తమ వ్యభిచారం సమాచారం గుప్తంగా ఉంటుందన్న ధైర్యముంటుంది. అటువంటి వారివల్ల థాయిలాండ్‌కి విదేశీ కరెన్సీ ఎక్కువగా లభిస్తుంది.

ప్రపంచ ఆర్థిక పరిస్థితులకు అనుగుణంగానే థాయిలాండ్‌లో శృంగార పర్యాటక పరిశ్రమ అభివృద్ధి చెందింది. 1967లో వియత్నాంలోని అమెరికను సైనికులకి విరామాన్నీ, విహారాన్నీ అందించే అవకాశమిమ్మని థాయిలాండ్ అమెరికా ప్రభుత్వాన్ని కోరింది. అప్పటి అమెరికా డిఫెన్స్ సెక్రటరీ రాబర్ట్ మెక్‌నమారా తరువాత ప్రపంచ బాంకు అధినేత అయ్యారు. ప్రపంచ బాంకు నుండి థాయిలాండ్ తీసుకున్న రుణాలు తీర్చివేయడానికై పర్యాటక శాఖను అభివృద్ధి చేయాలని ఆయన

సూచించారు. బ్యాంకులు, విమాన సర్వీసులు, టూరు ఆపరేటర్లు, హోటళ్ళు, బార్‌లు, వేశ్యావాటికల యజమానులు భాగస్వాములుగా ఏడాదికి నాలుగు బిలియన్ల డాలర్ల అంతర్జాతీయ థాయీ శృంగార పర్యాటక పరిశ్రమ ఏర్పడింది. పధ్నాలుగు సంవత్సరాలైనా లేని చిన్న పిల్లల నుంచి ఎందరో స్త్రీల శరీరాలను అమ్మి వీరందరూ లాభాలను ఆర్జిస్తున్నారు. అనేకమంది రాజకీయ నాయకులే వేశ్యావాటికలను నడుపుతున్నారని వినికిడి. ప్రభుత్వమే తార్పుడానికి పూనుకున్న శోచనీయ పరిస్థితి థాయిలాండ్‌లో ఉంది.

అంతర్జాతీయ కార్మిక సంస్థ వారి అంచనా ప్రకారం బాంగ్‌కాక్ లోనే రెండు లక్షల మంది వేశ్య లున్నారు. థాయిలాండ్ మొత్తానికి అయిదు లక్షలదాకా ఉన్నట్లు భావిస్తున్నారు. చిన్న పిల్లలను కూడా కలిపితే వీరి లెక్క ఇరవై లక్ష లుండవచ్చు ననుకుంటున్నారు. కానీ వేశ్యలలో అందరికన్నా ఎక్కువ సంపాదించే బార్‌గర్ల్ నెలసరి ఆదాయం 160 డాలర్లు మాత్రమే. కానీ వేశ్యగా జీవిస్తున్న ఒక్కొక్క అమ్మాయి మీద ఆధారపడి కుటుంబాలకి కుటుంబాలే జీవిస్తున్నాయి.

వ్యభిచారం ఇంత ఎక్కువగా ఉన్నప్పటికీ దానికి వ్యతిరేకంగా సాగుతున్న ఉద్యమం మాత్రం చిన్నదే. ఫ్రెండ్స్ ఆఫ్ వుమెన్, ఎంపవర్ వంటి సంస్థలు కండోముల గురించీ, ఎయిడ్స్‌వంటి వ్యాధుల గురించీ వేశ్యలకు చెబుతున్నారు. విదేశీయులు మోసగించకుండా ఆంగ్ల భాషను నేర్పిస్తున్నారు. "వేశ్యా వాటికల బదులుగా ఫాక్టరీలను నడపరాదా" అని ఎంపవర్ నడిపే చాంతానిపా అపిసుక్ ప్రశ్నిస్తున్నారు.

వ్యవసాయ రంగ అభివృద్ధి విధానాల వల్ల పల్లెలలో చాలామంది నిరాశ్రయు లయ్యారు. అటువంటి కుటుంబాలలోని స్త్రీలే నగర వేశ్యావాటికలలో ఎక్కువ మంది. వేశ్యావాటికల ఏజెంట్లు పల్లెలకు వెళ్ళి ధనాశ చూపించి, అమ్మాయిలను తల్లితండ్రులు అమ్మేలా చేస్తారు. పదిహేడేళ్ళ లోపు కన్యల కోసం రిఫ్రిజిరేటర్లు, టెలివిజన్లు, నగలు ఇవ్వడం కూడా ఉంటుంది. దేవాలయాలలో గ్రామ పూజారులు అందాల పోటీలు నిర్వహించడం ద్వారా ఈ పాపంలో పాలు పంచుకుంటున్నారు.

వేశ్యావాటికలో అడుగుపెట్టిన బాలిక బానిస అయినట్లే. తనకు కావలసినవన్నీ ఆమె కంపెనీ షాపులోనే ధర ఎక్కువైనప్పటికీ కొనుక్కోవాలి. జ్వరం వచ్చినా, రజస్వల అయినా, ఇంకే కారణంగానైనా విటులని సంతోష పెట్టలేనప్పుడు రోజులు లెక్క పెట్టి జీతం కోసివేస్తారు. జీవిత మంతా కష్ట పడినా ఆమె తన కష్టార్జితాన్ని కళ్ళతో చూడలేదు. ఒక స్త్రీ గర్భం ధరించినా, ఆమెకు ఎయిడ్స్ వచ్చినా కేవలం ఛార్జీ లిచ్చి ఆమెను ఇంటికి పంపివేస్తారు. కుటుంబం తిరిగి ఆహ్వానించే అవకాశాలు తక్కువైన ఆమె భవిష్యత్తు అంధకారమయమే. పల్లెలో వేశ్యగానే ఆమె చివరి రోజులు గడిచిపోతాయి.

శృంగార పర్యాటక వ్యాపారం ఇప్పుడు కాంబోడియాలో, దక్షిణ కొరియాలో, మ్యాన్మార్ (బర్మా)లో కూడా వృద్ధి చెందుతోంది. కాంబోడియాలో స్త్రీ ఉద్యమకారిణులు ఎంత ప్రయత్నించినా అక్కడి పురుషాధిక్య ప్రభుత్వం ఏమీ చెయ్యడం లేదు. జపాన్‌దేశంలో డెబ్భైవేలదాకా థాయీ స్త్రీలు సెక్స్ క్లబ్బులలో "హోస్టెస్"లుగా వెట్టిచాకిరీ చేస్తున్నారు. థాయీ బ్రోకర్లు వీరిని 14,000 డాలర్లకి అమ్మివేస్తారు. వీరిని కొన్న జపాను బ్రోకర్లు క్లబ్బులకు 30,000 డాలర్లకి అమ్ముతారు. క్లబ్బువారు ఈ ధనం రాబట్టుకునేదాకా స్త్రీలు పనిచెయ్యాలి. సాధారణంగా అప్పుతీరడం అనేది జరుగదు. ఈ స్త్రీల దయనీయ స్థితిని జపానులో అధికారులు పట్టించుకోరు. తప్పించుకున్న స్త్రీలను పోలీసులే క్లబ్బులకు అప్ప చెప్పిన సందర్భా లున్నాయి.

తప్పించుకునేందుకు చేసే ప్రయత్నంలో భాగంగా థాయీ వేశ్యలు ముగ్గురు కాపలా దారులను చంపివేశారు. జపానులో చాలామంది న్యాయస్థానం వేశ్యలను మానవతా దృక్పథంతో విచారించాలని కోరుతున్నారు. ఈ వేశ్యలలో గన్ అనే అమ్మాయి "నా జీవితం పశువు కన్నా హీనంగా ఉండేది. నన్ను మూడుసార్లు అమ్మేశారు. నేను ఇంటికి వెడతానంటే నా యజమానురాలు నేను తనకు రుణపడి ఉన్నాననీ, అప్పు తీర్చే వెళ్ళాలనీ చెప్పింది. ప్రతిరోజూ చాలా మంది మగవాళ్ళతో గడపాలి. రజస్వలా సమయంలో కూడా నన్ను వదిలేవారు కాదు. పారిపోతే నన్నూ, నా తల్లి తండ్రులనూ కూడా చంపుతా మని బెదిరించారు." అని చెప్పింది.

థాయిలాండ్ లాగానే ఫిలిప్పీన్స్‌ని కూడా పర్యాటక పరిశ్రమను పెంపొందించమని ప్రపంచ బాంకు ప్రోత్సహించింది. ఫిలిప్పీన్స్ స్త్రీలను వాడుకోవచ్చునన్న ఊహ మొదలైంది. 1980 ప్రాంతాలలో శృంగార పర్యటనలే ప్రభుత్వ ఆర్థిక వ్యవస్థకు మూలస్తంభాలుగా మారాయి. మార్కోస్ నియంతృత్వం తరువాత ప్రభుత్వం పగ్గాలను చేపట్టిన కోరజాన్ అక్వినో·దేశ గౌరవాన్ని కాపాడతానని ప్రతిజ్ఞ చేశారు. స్త్రీలు ఆమెను శృంగార పర్యటనలు ఆపివేయమన్నారు. అమెరికా సైనిక స్థావరాలకు లీజ్ మంజూరు చెయ్యవద్దని కోరారు. పినాటుబో అగ్ని పర్వతం పేలిన కారణంగా సైనిక స్థావరాలకు లీజ్ మంజూరు కాలేదు.

స్త్రీ ఉద్యమ వాది కానప్పటికీ అక్వినో టూరిజం మంత్రిత్వ శాఖాధిపతినీ, విధానాలనూ మార్చారు. అయితే మనిలాలోని బార్‌లనూ, మాసేజ్ పార్లర్‌లనీ రెయిడ్ చెయ్యాలని ఆమె 'స్త్రీ ఉద్యమ కారిణులను సంప్రదించకుండానే ఆదేశించారు. ఆ సమయంలో వేశ్యావాటికల యజమానులను కాని, విటులను కాని, తార్చేవారిని కాని అరెస్టు చెయ్యలేదు. కొన్ని వందల మంది స్త్రీలను అరెస్టు చేశారు. కానీ వారికి వేరే ఉపాధి చూపించలేదు. 1988లో మిరియం డిఫెన్సర్ శాంటియాగో ఇమిగ్రేషన్ కమిషనర్‌గా కొన్ని మార్పులు తెచ్చారు. చిన్న పిల్లలతో వ్యభిచరించే విదేశీ విటులను వెనక్కి పంపివేస్తున్నారు. విటులకు, తార్చేవారికి కారాగారశిక్ష విధించే చట్టం 1993లో అమలులోకి వచ్చింది.

విటిట్ ముంటర్భర్న్ అనే థాయీలాండ్ లా ప్రొఫెసర్ చిన్న పిల్లల అమ్మకానికీ, వారితో వ్యభిచారానికీ ముఖ్య కారణం ఎయిడ్స్ భయం అంటున్నారు. నాలుగేళ్ళ పిల్లలని కూడా మభ్య పెట్టి వ్యభిచారంలోకి దించుతున్నారు. మిగిలిన పిల్లలను పోషించడానికై తల్లితండ్రులే పిల్లలను అమ్మివెయ్యడం కూడా జరుగుతోంది.

బ్రెజిల్‌లోని అమజాన్ బంగారుగనుల ప్రాంతంలో పాతికవేల మంది అమ్మాయిలు వేశ్యావృత్తిలోకి దింపబడినట్లు అంచనా. ఉద్యోగా లిప్పిస్తా మన్న ఆశ చూపించి, వేశ్యావాటికలలో అమ్మివేస్తారు. అప్పు తీరేదాకా వారు పనిచేయ్యాల్సిందే. తప్పించు కుందుకు ప్రయత్నించిన వారిని నానా హింసలు పెడతారు. ఈ విషయంలో లంచగొండులైన పోలీసులదే ప్రధానపాత్ర.

ఆఫ్రికా, ఉత్తర అమెరికా, ఐరోపాలలో కూడా చిన్న పిల్లలతో వ్యభిచారం ఎక్కు వవుతోంది. ఎక్కు వవడానికి కారణం ఎయిడ్స్ భయ మొక్కటే కాదు. శృంగార పర్యాటకులలో చాలా మంది ఎదిగిన స్త్రీలతో శృంగారం విసుగనుకుని, మార్పు కోసం చిన్న పిల్లలను కోరుకుంటున్నారు. కారణ మేమైనప్పటికీ, చిన్న పిల్లలతో శృంగారం వల్ల ఎయిడ్స్ రాదనుకోవడం పొరపాటు. ఇండియా, థాయీలాండ్, ఫిలిప్పీన్స్‌లో చాలా మంది చిన్న పిల్లలు ఎయిడ్స్‌తో బాధ పడుతున్నారు.

'సెంటర్ ఫర్ ది ప్రొటెక్షన్ ఆఫ్ చిల్డ్రన్స్ రైట్స్' వంటి సంస్థలు వేశ్యావాటికల నుంచి చిన్న పిల్లలను

విడిపించడానికి ప్రయత్నిస్తున్నాయి. ఆ సంస్థలో పనిచేసే మారీ ఫ్రాన్స్‌బోట్ అనే ఆమెను వేశ్యావాటికల తాలూకు గూండాలు కొట్టి, స్పృహ లేని పరిస్థితిలో నుదుటిని సిగరెట్లతో కాల్చారు.

వర్ధమాన దేశాలలోని వేశ్యావాటికలకీ, ఆ దేశాలలోని అమెరికను సైనిక స్థావరాలకీ గల అనుబంధాన్ని గమనించవచ్చు. యుద్ధంలో విజయ ఫలాలుగా స్త్రీలని భావించడం అనాదిగా వస్తున్నదే. అయితే యుద్ధమే లేని సమయంలో కూడా శ్వేత జాతీయులు కాని స్త్రీలను హక్కుగా నేటి సైనికులు భావిస్తున్నారు. తమ దేశ స్త్రీలపై అత్యాచారం చేసిన అమెరికను సైనికులను ఆదేశ ప్రభుత్వాలు ఏమీ చేయ్యలేక పోతున్నాయి. ముద్దాయిలైన సైనికులు డ్యూటీలోనే ఉన్నట్లుగా సర్టిఫికెట్లివ్వడం అమెరికను నౌకాదళానికి ఆనవాయితే. ఒక్కోసారి నేరం విషయమై కోర్టులో ఫిర్యాదు చేయక ముందే వారిని దేశం నుంచి పంపివేస్తూ ఉంటారు. ఈ మార్గాలు సాధ్యం కాకపోతే అత్యాచార బాధితులకు డాలర్లిచ్చి వారు మాట్లాడకుండా చేస్తారు.

అమెరికన్ సేన తమ సైనికుల శృంగార పరమైన కోరికలు తీరడానికి వీలుగా విధానాలను రూపొందించింది. వేశ్యావాటికల స్థానమూ, స్త్రీల ఆర్థిక అవకాశాలూ అమెరికన్ సేన నిర్ణయిస్తున్నది. ఎక్కడైతే సైన్యముందో అక్కడ వేశ్యా సంబంధమైన ఆర్థిక వ్యవస్థ వృద్ధి చెందుతోంది.

అయితే నిర్బంధ వ్యభిచారం వర్ధమాన దేశాలలో నివసిస్తున్న స్త్రీలకే పరిమితం కాదు. అమెరికాలో ఉన్న వర్ధమాన దేశ స్త్రీలకు కూడా అన్యాయాలు జరుగుతున్నాయి. ఆగస్టు 1, 1991 నాటి హోస్టన్ ప్రెస్ పత్రికలో జాన్ డేవిడ్ సన్ వ్రాసిన "సోల్డ్ ఇంటూ స్లేవరీ : ఆన్ ఇమ్మిగ్రంట్స్ నైట్ మేర్" అనే వ్యాసం ప్రచురితమైంది. అందులో మరియా (అసలు పేరుకాదు) అనే హోండురస్ స్త్రీ దయనీయ గాథ ఉంది.

1990 జూన్‌లో మరియా తన దేశాన్ని వదిలి అమెరికాకు ఉద్యోగం కోసం బయల్దేరింది. ధనం సంపాదించి తన కుటుంబానికి పంపాలని ఆమె ఆశ. వీసా లేని ఆమెనూ, ఆమె స్నేహితురాలినీ ఒక హోండురస్ దేశస్థుడు దొంగతనంగా సరిహద్దు దాటించాడు. తమ దేశస్థుడయిన కారణంగా వారు అతనిని నమ్మారు. హోస్టన్‌లో స్త్రీలిద్దరినీ 450 డాలర్ల చొప్పున ఇమ్మని అడిగాడు. వారివద్ద ధనం లేదు. అతడు స్త్రీలిద్దరినీ కాంటీను నడిపే తన సోదరికి అప్పగించాడు. మగవారితో కలిసి డాన్స్ చేయ్యడం, బీరు తాగడం చెయ్యాల్సి వచ్చింది. మరియా వ్యభిచారానికి కూడా సిద్ధపడే సమయంలో ఆమె అదృష్టవశాత్తు యజమానురాలికి గుండె జబ్బు వచ్చి తప్పించుకోగలిగింది. కానీ తప్పించుకోలేని దురదృష్టవంతులైన మరియా లెందరో?

ఈ పరిస్థితిని పాత సోవియట్ యూనియన్ పరిస్థితితో పోల్చి చూద్దాము. బొల్షివిక్ విప్లవం తరువాత రష్యాలో వ్యవస్థీకృత వ్యభిచారాన్ని నిర్మూలించి, అంతవరకూ వేశ్యావృత్తిలో ఉన్న స్త్రీ లందరికీ ఉపాధి కల్పించారు. స్త్రీ పురుషు లిద్దరూ సమానమే నన్న కమ్యూనిస్టు సిద్ధాంతాలకు ఇది ప్రతీక. కార్ల్‌మార్క్స్, ఫ్రెడెరిక్ ఎంజెల్స్ ప్రతిపాదించిన "స్త్రీ విషయిక ప్రశ్న"కు సమాధానంగానే నిర్ణయాలు అమలు జరిగాయి.

చైనాలో రెడ్ ఆర్మీ విజయానంతరం ముఖ్య పట్టణాలలోని వేశ్యావాటికలలోని స్త్రీలకు విముక్తి కల్పించి, చదువు చెప్పించి, ఉద్యోగా లిచ్చారు. 1959లో క్యూబా విప్లవం తరువాత కాస్ట్రో ప్రభుత్వం హవానాలోని వేశ్యావాటికలను మూసివేసి, వ్యభిచారాన్ని నిర్మూలించింది. మాజీ వేశ్యలందరికీ విద్యా, ఉద్యోగ అవకాశాలు కల్పించారు. స్త్రీలు వేశ్యలుగా మారే దుర్భర పరిస్థితి ఏనాటికీ రాదని కాస్ట్రో అనేక సార్లు ఉపన్యాసించారు.

అయితే 1991లో సోవియెట్ యూనియన విడిపోయాక స్త్రీలల ఏదరకం ఎక్కువైంది. ప్రైవేటీకరణ వల్ల ఆర్థిక తారతమ్యాలు ఎక్కువై అనేక సాంఘిక, ఆర్థిక సమస్యలు ఉత్పన్నమయ్యాయి. అనేకమంది రష్యను స్త్రీలూ, తూర్పు ఐరోపాకు చెందిన మహిళలూ జీవితంలో వెనుకబడ్డారు. అంతర్జాతీయ వ్యభిచార రాక్షసి కోరలలో చిక్కుకున్నారు. నేటి రష్యాలో నిరుద్యోగులలో మూడు వంతులు స్త్రీలే. వారిలో చాలామంది శరీరాలను అద్దెకిచ్చుకొని జీవిస్తున్నారు. స్త్రీ పురుషుల వేతనాలలో తేడా కూడా గత రెండేళ్ళలో బాగా పెరిగింది.

ప్రపంచ పెట్టుబడి ఆర్థిక వ్యవస్థలో భాగమైన దేశానికి మహిళలను స్వార్థ ప్రయోజనాలకు వాడుకోడానికి ఎక్కువ సమయం అక్కరలేదు. మాస్కోలోని ఆఫ్రోడైట్ అనే స్ట్రిప్‌టీజ్ స్కూలు "మీ బట్టలనూ, సిగ్గునూ వదిలెయ్యండి" అని ప్రకటించింది. దారిద్ర్యం నుంచి విముక్తికి ఇదొక్కటే మార్గమని నమ్మిన వందలాది స్త్రీలూ, బాలికలూ దరఖాస్తులు పెట్టుకున్నారు. స్కూలులో చేరడానికి పరీక్షగా దరఖాస్తుదారులు స్కూలు డైరక్టరు, ఇద్దరు పురుషులైన జడ్జీలు, ఫోటో గ్రాఫర్ల ఎదురుగా అండర్‌వేర్ తప్ప అన్ని దుస్తులనూ విప్పి, నడవాల్సి వచ్చింది. ఏనాడూ ఇటువంటి పని చెయ్యని అమ్మాయిలని తల్లులే బలవంత పెట్టారు. అర్ధ నగ్నం కాలేని అమ్మాయిలు ఏడవడం ప్రారంభించారు. స్కూలు డైరెక్టరు తన స్కూల్లో 'విద్య" ను పూర్తి చేసిన అమ్మాయిలకు జర్మనీ, ఫ్రాన్సు, నార్వే, స్వీడన్, సింగపూర్‌లలో రాత్రికి 120 డాలర్ల చొప్పున ఆరునెలల వరకూ సంపాదించే అవకాశాలు కల్పిస్తామనీ, అందులో 15 శాతం మాత్రమే డైరెక్టరుకి చెందుతుందనీ చెప్పారు. ఈ అమ్మాయిలలో చాలామంది విదేశాలలో వేశ్యలుగా ఉండిపోతారని కూడా జ్యోసం చెప్పారు. అంటే అంతర్జాతీయ వ్యభిచారానికి ఆఫ్రోడైట్ సహకరిస్తున్నట్లే కదా! యిదీ ప్రస్తుత రష్యాలోని స్థితి.

వివరాలన్నీ సమీక్షిస్తే అంతర్జాతీయ పెట్టుబడి ఆర్థిక విధానాన్ని అనుసరించే ఒక సరళిని మనం గమనించవచ్చు. అంతర్జాతీయ వ్యవస్థీకృత వ్యభిచారానికి సప్లై వైపు ఇంకే విధమైన అవకాశాలూ లేని, చదువురాని, బీదవారైన అమ్మాయిలూ, వారి కుటుంబాలూ ఉంటాయి. సాంఘిక ప్రగతి లేని పెరుగుదల విధానాల వల్ల ఈ పల్లెటూరి కుటుంబాలు గత్యంతరం లేని పరిస్థితిలో చిక్కుకుని ఉంటాయి. ఆర్థికంగా హీనస్థితిలో ఉన్న స్త్రీలను అనేక విధాలుగా సంపాదించి దేశ దేశాలకు "రవాణా" చెయ్యగల బ్రోకర్లుంటారు. ఒకసారి వేశ్యావాటికలోబందీ అయ్యాక స్త్రీ ఏ విధంగానూ తప్పించుకోలేని "వెట్టి చాకిరీ" వ్యవస్థలో పాతుకుపోయి ఉంటుంది.

ఇకపోతే, డిమాండ్ వైపు ఫలానా జాతి స్త్రీలు సులభంగా లభ్యమవుతారని చెప్పి తార్చేవారు ఉండాలి. ప్రైవేటు టూర్ ఏజెన్సీలను, శృంగార పర్యటనలు నిర్వహించే ప్రభుత్వాలను తార్చేవారిలో జమ కట్టవచ్చు. థాయీ స్త్రీలు "ప్రకృతి సిద్ధంగానే కామకళలో నిష్ణాతులు" అని ఒక స్విట్జర్లాండ్ టూరు ప్రకటనలో ఉంది. డిమాండ్ వైపు అతి ముఖ్యమైనది తమ జాతిస్త్రీలతో విసుగెత్తి, గుప్తంగా, శిక్షింపబడతామన్న భయం లేకుండా ఇతర జాతి స్త్రీలతో శృంగారాన్ని కొనుక్కోగల మనుకునే ధనవంతులైన పురుషులు.

మనమేం చెయ్యగలం? "కొయిలేషన్ అగెయిన్స్ట్ ట్రాఫికింగ్ ఇన్ వుమన్" సంస్థ స్త్రీల అమ్మకానికీ, తార్చడానికీ వ్యతిరేకంగా చట్టాలకై చేసే ప్రయత్నంతో సహకరించాలి. నిర్బంధంలేక పోయినా కూడా శృంగారం అమ్మకం కాకుండా ఐక్యరాజ్య సమితి నిషేధం చేసేలా చూడాలి. అన్నిటికన్నా ముఖ్యమైనది స్త్రీలు ఆర్థికంగా, రాజకీయంగా, విద్యావిషయికంగా ప్రపంచ మంతటా సమానమయ్యేట్టు చేసేందుకు జరిగే ప్రతి ప్రయత్నానికీ చేయూత నివ్వాలి. ●

పంచామృతాలు

# అత్తలు

-పురాణం సుబ్రహ్మణ్యశర్మ

"అత్తవా రిచ్చిన అంటు మామిడి తోట" అన్నాడు చింతామణి నాటకంలో. కాని మామగారి ప్రసక్తి ఎక్కడా లేదు. చంటి పిల్లవాడు మాటలు నేరుస్తున్నపుడు 'అమ్మ' కంటె ముందు 'అత్త' అని పలకడం నేర్చుకుంటాడు. 'అత్త' తరువాత 'తాత' అనడం వస్తుంది పిల్లలకి. రాధ శ్రీకృష్ణునికి అత్త వరుస. 'మేనమామ భార్య మేనత్త కాదు' మేనత్త మొగుడు మేనమామకాడు; అని మన వరుసలలో వైవిధ్యం గురించి ఓమాట వుంది. యన్.టి. రామారావు అల్లుళ్ళకు అత్తగారితోనే కదా పేచీ! మన కల్చర్లో అత్తగారి స్థానం తల్లి తరువాత. ప్రతి తల్లి కోడలు వచ్చాక అత్తగా మారుతుంది. "అత్తలేని కోడలు గుణవంతురాలు" అని వాడుక. "కోడలి చేతి కుండ ఓటి కుండ, అత్త చేతి కుండ కొత్త కుండ" అని సామెత. మామగారిల్లు అంటే జైలు అని ఓ అర్థం. చూడుడు కాబూలీవాలా, టాగోర్‌కథ. 'అత్త సొమ్ము అల్లుడు దానంచేశా'డని మరో సామెత. 'ఊరివారి వడ్లపుణ్యాన మా అత్త చీర పుణ్యాన' అని ఓ కథ వుంది. ఓ పేదరాలైన అత్త యింటికి అల్లుడు వచ్చాడు. ఆవిడ వడ్ల చావిడి వద్దకు వెళ్ళి, అక్కడ దొర్లి, చీరకంటుకున్న వడ్లు దులిపి దంచి అల్లుడికి అన్నం పెట్టిందని ఓ చమత్కారం. 'క్షీర సముద్ర రాజతనయాం' అన్నారు లక్ష్మీ దేవిని. శ్రీమహావిష్ణువుకి సాక్షాత్తు సముద్రం అత్తవారిల్లు. కైలాసాధిపతి పరమేశ్వరునికి హిమవంతుడు మామ కదా. మామగారి మీదకి భద్రుని పంపి దక్షయజ్ఞాన్ని పార్వతి కోసం శివుడు ధ్వంసం చేయలేదా? మామగారింటి కంటె అత్తవారిల్లు చాలా సేఫ్. ప్రతి అల్లుడికి మామ వద్దకంటె అత్త వద్ద ఎక్కువ చనువు వుంటుంది. అల్లుడు తన కేదికావాలన్నా 'త్రూ ప్రాపర్ ఛానల్' అన్నట్లు అత్తగారి ద్వారా అడిగి రాబట్టాలి. ఒక అల్లుణ్ణి అత్తగారు అడిగిందట "నాయనా! మీ మామగారు పొలం వెళ్ళారు. వారు వచ్చే దాకా వుంటావా? లేక యిప్పుడు ఫలహారం చేస్తావా? నా కొడుకుతో ఉప్పుడు పిండి తిని వారొచ్చే వరకూ వుంటావా? లేక మా అమ్మాయితో చేగోడీలు తింటావా?" అని. దానికా అల్లుడు "ముందు ఫలహారం కానిచ్చి, మీ అబ్బాయితో ఉప్పుడు పిండి తిని, మీ అమ్మాయితో చేగోడీలు చప్పరించి, మామగారు వచ్చాక భోంచేస్తాను" అన్నాడట. అత్తవారింట్లో ఎక్కువ కాలం వుంటే అల్లుడు లోకువవుతాడని ఓ కథ వుంది. 'శాలీనుడు - సుగాత్రి'ల వృత్తాంతము చూడండి. ఇందులో పొలంలో పనిచేస్తున్న ప్రేయసి/భార్య పరమ ఆదరణీయగా, ఆకర్షకంగా కనపడుతుంది. సంత తులసీ దాసు కథలో కూడా అతను భార్య మీద అమితానురాగంతో అత్తవారింటి గోడ దూకి మహావర్షంలో భార్యను కలుసుకునేందుకు వెళ్ళినపుడు ఆమె అతనికి తన మీది లాలసతకు వగచి, "నా మీద చూపిన ప్రేమను శ్రీరాముని మీద చూపితే నీ కతను యింతకంటే హెచ్చు ఆనందాన్ని, ముక్తిని కలుగ చేస్తా"డని బోధించిన మీదట, తులసీ దాసు భక్తుడై 'రామ చరిత మానస్' రచిస్తాడు. చింతామణి నాటకంలో కూడా బిల్వమంగళునికి చింతామణి అనే వేశ్య తుఫాను రాత్రి నదిని దాటి

తాడనుకుని పాముని పట్టుకుని తన సంగమం కోసం వచ్చిన బిల్వమంగళుని దృష్టిని తుచ్ఛక సుఖముల మీద నుంచి శ్రీకృష్ణుని మీదకు మళ్ళిస్తుంది అప్పు డతను 'కృష్ణలీలాతరంగిణి'ని చెబుతాడు. అతనే లీలాశుకుడు. శశిరేఖాపరిణయం గురించి, సుభద్రను గురించి ఉన్న కథ అందరూ ఎరిగినదే. కాని యిటీవల ధన వ్యామోహం కారణంగా, యితర కుటుంబ శక్తుల పాశవిక చర్యల ఫలితంగా కోడళ్ళను వేధించిన అత్తలు కటకటాల పాలు కావలసి వస్తున్నది.

ఒక స్త్రీకి బహు పార్శ్వాలు! బహు రూపాలు. ఆవిడ బహురూపి. అందులో అత్త ఒక పార్శ్వం, ఒక స్థితి మాత్రమే. ముందుగా ఆమె కన్య, తరువాత భార్య, సంతానం కలిగాక తల్లి, ఆ సంతానం పెద్దయి వారికి వివాహ లయాక తను అత్తగా మారుతుంది. ఈ అన్ని అవస్థాభేదాలలో ఆమె అత్తగారి దశను దాటి, మామ్మ, అమ్మమ్మ అవుతుంది. ఒకనటి/నటుడు బహుపాత్రలను కడు సమర్థతతో నైపుణ్యంతో పోషించినట్లుగానే అన్ని అవస్థలలో స్త్రీ రాణిస్తుంది. భూమి తన చుట్టూ తను తిరిగినట్లు గానే ఈ ప్రపంచం స్త్రీ చుట్టూ తిరుగుతూ వుంటుంది. అత్తలకు సూర్యకాంతం పాత్ర ఒక మంచి నమూనా. నటి భానుమతి 'అత్తగారి కథలు' అని రాసి సాహిత్య అకాడమీ బహుమతి గెల్చుకుంది. ఇంగ్లీషు అత్తగారు వురితాడు. అత్తగారి మీద కార్టూన్లు కూడా వచ్చాయి. అక్కడ అత్త కూతురి కాపురాన్ని అంటిపెట్టుకుని అల్లుడి మీద పెత్తనం చేసి సాధించే పాత్ర. ఒక విధమైన పారసైటు.

అత్తగార్లకు కూతుళ్ళమీద మమకారం, మోజు జాస్తి. పుట్టింటిని దోచి కొందరు కూతుళ్ళను గుర్రాల వలె మేపుతూ వుంటారు. ఈ విపరీత ధోరణులవల్ల కుటుంబ కలహాలు, కోడళ్ళకు అత్తలకు మనస్పర్థలు ఏర్పడుతూ వుంటాయి. సమష్టి కుటుంబాలలో గొడవలు వుండటం వలన ఆధునికులు వీలయినంత వరకూ భార్యా భర్త చిన్న కుటుంబాలుగా విడిగా జీవించడం ప్రారంభించారు. వివాహం కాని ఆడబడుచులు వీరి బారిన పడి కోడళ్ళ హింసలకు గురివుతూ వుంటారు.

వంట యింటి చాకిరీకి విలువ లేదు. కాని అందరూ దీనిమీద ఆధారపడిన వారే. ఈ శ్రమఅంతా చేసినన్నివాళ్ళు చేసిన అత్తగారు అదంతా కోడలికి అప్పజెప్పి విశ్రాంతి తీసుకోవాలని అనుకోడం సహజమే. కాని తను పడిన బాధలన్నీ కోడలు కూడా పడాలనుకోవడంలో తిరకాసు వుంది. రష్యా వంటి దేశంలో కూడా అత్త కోడలి తగవులున్నాయని, అవి తప్పవని తెలుసుకున్నాం. ఎన్.టి.ఆర్ వంటి గొప్ప నటుడు తెలుగు దేశంసృష్టికర్త, అధిపతి. అతని అంతఃపురంలో సైతం అత్తా - అల్లుళ్ల గొడవలు వచ్చాయంటే - ఆశ్చర్యమే. శ్రీకృష్ణునికి పదహారు వేల మంది భార్యలని పురాణాల్లో చదివాం. అయితే ఆయనకు అంత మంది అత్తలూ వున్నట్లే కదా! అత్త గారిపేరు చెప్పగానే సక్కుబాయి అత్తగారి కథ జ్ఞాపకం వస్తుంది. పాండు రంగడు సైతం సక్కుబాయి వేషం ధరించి అత్తగారికి సేవలు చేశాడు. అత్తగారికి దర్శనం యిచ్చి సేవలు చేస్తూ అసలు సక్కుబాయిని పండరిపుర యాత్రలకు పంపించాడు.

మేనకాగాంధీ, సోనియాగాంధీ వంటి కోడళ్లను పొందిన స్వర్గీయ ఇందిరాగాంధీ అత్తగారుగా తన తడాఖా చూపించలేదనే చెప్పాలి.

●

# గాంధారి

మూలం : ఇరావతి కర్వే భావపరిశీలన: రవీంద్రనాథ్

ధృతరాష్ట్రునితో గాంధారి వివాహం నిశ్చయమైంది. మహారాణికి సంక్రమించే సకల వైభోగాలను తలచుకొని గాంధారి మురిసిపోయింది. హస్తినాపురం నుండి పెళ్లి నిశ్చితార్థానికి తెచ్చిన కానుకలు అందరి కళ్లను మిరిమిట్లు కొల్పాయి. మగ పెళ్లివారి రథాలు, దుస్తులు, ఆభరణాలు అందరినీ ఆకర్షించాయి. గాంధారి లోలోన ఎంతో సంతోష పడింది. తన అదృష్టానికి సంబరపడి, పెళ్లి నిమిత్తం హస్తినాపురికి బయలు దేరింది. తనతో పాటు, తన చెలికత్తె, తన సోదరుడు శకుని మాత్రం బయలు దేరారు. ప్రయాణం ఎంతో ఆహ్లాదకరంగా సాగింది. ఆ పరిసర ప్రకృతి సౌందర్యాలను గమనించే స్థితిలో గాంధారి లేదు. తన మనస్సు, తాను చూడని హస్తినాపుర భోగ భాగ్యాల వూహాగానాలతో పులకరించి పోతూంది.

ప్రయాణం ముగిసి పెళ్లివారు హస్తినాపురం చేరారు. భీష్ముడు గాంధారిని ఆహ్వానించేందుకు వచ్చాడు. ప్రజలంతా దారి కిరు వైపుల బారులు తీరి, ఆమెకు హృదయ పూర్వకంగా ఆహ్వానం పలికారు. ప్రయాణ బడలికతో ఆమె ఆహ్వానపు టేర్పాట్లను అంతగా గమనించ లేక పోయింది. విడిది చేరి రెండు రోజులు విశ్రాంతి తీసుకుంది. తన చెలికత్తె ప్రతిరోజు రాజ ప్రాసాద మంతా కలయ దిరిగి, తాను చూచిన కౌరవుల వింత వైభోగాలను గాంధారికి చెబుతూ వుండేది. తన కాబోయే భర్త ఐశ్వర్యాలను, పుర ప్రజలను వర్ణించి చెప్పినప్పుడు గాంధారి ఎంతో గర్వపడింది. సాయంత్రం వేళల్లో హస్తినాపుర వీధుల్లోని ప్రజలను తిలకిస్తూ, యమునానది తీరం వెంట సుదీర్ఘంగా విస్తరించి వున్న అడవుల సౌందర్యాన్ని చూస్తూ కాలం గడిపేది. తన తల్లిదండ్రుల స్వంత వూరితో పోలిస్తే హస్తినాపురం ఎంతో పెద్దది, సుందరమైంది. తను పుట్టి పెరిగిన వూరును మరిచి, తన మనస్సు కౌరవ మహా సామ్రాజ్యానికి తాను మహారాణిగా సర్వ సౌఖ్యాలు అనుభవించే స్వప్నంలో తేలి పోయింది. రెండవ రోజు ఎప్పటి మాదిరే తన చెలికత్తె తెచ్చే కబుర్ల కోసం ఎదురు చూస్తూ కూర్చుంది. ఎంతో విచారంతో, కన్నీళ్లతో దగ్గర కొచ్చిన చెలికత్తెను కంగారుగా అడిగింది "ఏమిటి అలా వున్నావు?" చెలికత్తె గాంధారి చెయ్యి పట్టుకొని "అమ్మా! నీవు మోసపోయావు. మనల్ని మోసం చేశారు. నీవు పెళ్లి చేసుకోబోయే యువరాజు పుట్టు గ్రుడ్డివాడు". గాంధారి తన చెవులను తానే నమ్మలేక పోయింది. ఒక్క క్షణం దిగ్భ్రాంతితో తల తిరిగి స్పృహకోల్పోయి పడిపోయింది.

2

గాంధారి అంతఃపురంలో కూర్చొని వుంది. తన చెలికత్తె దగ్గరకు వచ్చి ఆమె తలవెంట్రుకలను ప్రేమతో నిమురుతూ "యువరాణీ! నీవు ధైర్యంగా వుండాలి" అంటూ జరిగిన ఘోరాలను నెమరువేస్తూ చింతిస్తున్న గాంధారికి ధైర్యాన్ని నూరిపోస్తూ వుంది. తాను తల్లిగానూ, నాయనమ్మగానూ మారిన తర్వాత కూడా తన చెలికత్తె తనను 'యువరాణి' అని పిలువడం ఆమెకు విడ్డూర మనిపించింది. గాంధారి కొడుకు లంతా యుద్ధంలో చనిపోయారు. ఆఖరుకు దుర్యోధనుడు కూడా చనిపోయేటప్పటికి ఆమెకు దుఃఖం ఆగకుండా వుంది. "గాంధారీ! ఓర్పుతో వుండు; దిగులు పడకు" అంటూ చెలికత్తె తనను వూరడించటానికి ప్రయత్నిస్తే "ఇప్పుడు నన్ను కలత పెట్టే దేమీ లేదు. పిల్లలు కలుగగానే గాంధారి యిప్పుడైనా సుఖపడుతుందని నీవు అనుకున్నావు. కాని అలా జరుగలేదు. పిల్లలకు ఏదైనా హాని జరిగితే నా మనస్సు తల్లడిల్లి పోయేది. వారు ఏడిస్తే నేను కళ్ల నీళ్లు పెట్టుకొనే దాన్ని. వారు రథం పందెంలో ఓడిపోతే నేను నిరాశ చెందేదాన్ని. వారు అవమానాలకు గురైతే, వారికంటే నాకే ఎక్కువ అవమానంగా భావించేదాన్ని. పాండవులను సరిహద్దు దాటి వెళ్లిపొమ్మన్నారు. వారు నా వద్దకు వచ్చి తమకు వీడ్కోలు చెప్ప మన్నారు. పైకి వారిని నేను దీవించినప్పటికి, నా మనస్సులో

మా(త్రం "మంచిదైంది. నా పిల్లల దారికి అడ్డం తొలగిపోయింది" అని సంతోషించాను. యుద్ధానికి ముందు నీ సలహా వల్లనే సభకు వెళ్లి యుద్ధం మానమని వేడుకున్నాను. కాని, లోలోపల యుద్ధంలో నా పిల్లలు గెలిస్తే హస్తినాపుర రాజ్యం శాశ్వతంగా మాకు దక్కుతుందని అనుకున్నాను. యుద్ధం మొద లౌతూనే నాకు భయం పట్టుకుంది. (ప్రతిరోజూ అడిగేదాన్ని "యీ రోజు ఏమైందని ". యుద్ధంలో నా పిల్లలు చనిపోతూవుంటే 'యీ రోజు ఎందరు మిగిలారని' అడిగేదాన్ని . (ప్రతి పిల్లవాడూ పోతూవుంటే నా మనస్సు తరుక్కు పోయేది. నాకు స్వంత జీవిత మంటూ లేదు. పిల్లల సుఖమే నా సుఖం. వారి దుఃఖమే నాదుఃఖం" అంటూ గాంధారి విలపిస్తూ వుంటే చెలికత్తె "మనస్సు దిట్టం చేసుకో తల్లీ!" అంటూ సముదాయించ బోయింది. దానికి గాంధారి "అదే నేను చెబుతూ వుంది. ఈ నాడు నా మనస్సు (ప్రశాంతంగా వుంది. ఎవరి గెలుపూ నాకు సంతోషాన్ని కలిగించదు. ఎవరి ఓటమీ నాకు విచారాన్ని కలిగించదు. ఇప్పుడు నేను ఆతృత పడేందుకు ఎవరూ లేరు. దేని కోసమూ ఆశ లేదు. దేని కోసమూ భయం లేదు" అంటూ తన నిర్లిప్తతను వ్యక్తం చేసింది.

ఆ సమయంలో ధృతరా(ష్ట్రుడు ఒక సేవకుని సహాయంతో గాంధారిని ఓదార్చేందుకు వచ్చాడు. "గాంధారీ, గాంధారీ" అనే పిలుపు వినబడుతూనే తాను అంతవరకు తన చెలికత్తెకు చెప్పిందంతా ఒక్కసారి అబద్ధ మనిపించింది. తన భర్త జీవించేంత వరకు సుఖ దుఃఖాల నుండి తాను దూరంగా పోలేదు. అయితే "ఆయన కూడా....." అంటూ రెండవ సారి స్పృ హతప్పి పడిపోయింది. ధృతరా(ష్ట్రునికి ఏమైందో అర్థం కాలేదు. తన అంధత్వంతో చుట్టు(ప్రక్కల తిరిగి "ఏమైంది, ఏమైంది?" అంటూ అరిచాడు.

3

ఈ రోజు అందరూ తమ ఆ(శమాన్ని వదిలి హిమాలయ పర్వతాన్ని ఎక్కుతూ పోతున్నారు. తమ ఆ(శమంలో సేవకు లున్నారు. చుట్టు (ప్రక్కల ఋషుల ఆ(శమా లున్నాయి. ధర్మరాజు, మిగత యువరాజులు తమను కలుసుకునేందుకు రెండు పర్యాయాలు ఆ(శమానికి వచ్చి వెళ్లారు. మొత్తానికి ఆ ఆ(శమంలో వారికి జీవితం (ప్రశాంతంగానే వుంది. ధృతరా(ష్ట్రుడు, గాంధారి, విదురుడు, కుంతి అందరి ఆ(శమ జీవితం సాఫీగానే దొర్లిపోయింది. ఋషుల సమక్షంలో ఎన్నో విషయాలను చర్చించేవారు. గాంధారి, కుంతి వింటూ వుండేవారు.రాజులుగా మారిన యువరాజులు అప్పు డప్పుడు వారిని దర్శించి పాదాలకు నమస్కరించినప్పుడు మా(త్రం వారి హృదయాలు విభిన్న భావాలతో నిండేవి. వారు వెళ్లిపోతూనే ఆంతరంగికంగా మధన పడేవారు. ఈ నాడు హస్తినాపురం నుండి ధర్మరాజు, యితర యువరాజులు వచ్చారు. అప్పుడు ధృతరా(ష్ట్రుడు ఏదో నిర్ణయానికి వచ్చినట్లుగా "యుధిష్ఠిరా! యిది మాకు ఆఖరి ఆ(శమం మా(త్రం కాదు. మేము నలుగురం మా స్వంత ఆ(శమాన్ని కట్టుకొని అందులో నివసించా లనుకుంటున్నాం. రాజ (ప్రాసాదానికి దూరంగా నివసించే అలవాటు చేసుకునేందుకు చాలా నెలలు పట్టింది. ఇప్పుడు పర్వతం పైకి పోయి అక్కడి అడవిలో వుండా లనుకుంటున్నాం." అందుకు ధర్మరాజు అంగీకరించలేదు. విదురుడు ధృతరా(ష్ట్రుణ్ణి సమర్థించాడు. "ధర్మరాజా! ధృతరా(ష్ట్రుడు చెప్పింది సరియైంది. ధర్మం గురించి నీకు బాగా తెలుసు. ఈ (ప్రపంచంలోకి మమ్మల్ని మళ్లీ ఎందుకు యీడుస్తావు? వీడ్కోలు చెప్పి వెళ్లిపో!" కుంతి కళ్లు చెమ్మగిల్లాయి. ఆమె కూడా ధృతరా(ష్ట్రుని నిర్ణయానికి సరే నంది. అయితే, గాంధారి అభి(ప్రాయాన్ని ఎవరూ అడుగలేదు. ఆమె భర్త అభి(ప్రాయాన్నే ఆమె అభి(ప్రాయంగా భావించారు.

○ వారితో పాటు కొందరు యువకులు, వారి భార్యలు, ఋషులు బయలు దేరారు. పగలంతా నడిచి ఒకచోట విడిది చేశారు. వారితో వచ్చిన వారంతా తిరిగి వెళ్లిపోయారు. సేవలు చేసేందుకు సేవకుల నిస్తానని ధర్మరాజు చెప్పినా, వారు ససేమిరా అన్నారు. ఆఖరుకు ఆ నలుగురే మిగిలారు. గాంధారి, ధృతరా(ష్ట్రుడు ఒక

నీడ పట్టున కూర్చున్నారు. గాంధారి మౌనంగా కూర్చొని, వున్నట్టుండి ఒక దీర్ఘ నిట్టూర్పును ఖిడిచింది. అప్పుడు ధృతరాష్ట్రుడు ఆమెకేసి తిరిగి హేళనా స్వరంతో "ఇప్పుడు నిట్టూర్పు విడిస్తే లాభం ఏంటి? ఇద్దరు గ్రుడ్డివాళ్లకు ఎలాంటి జీవిత ముంటుందో అలాంటిదే మనం అనుభవిస్తున్నాం" అనేటప్పటికి, గాంధారి ఆయన మాటలకు, గొంతు స్వరానికి వులిక్కిపడింది. మామూలుగానైతే జవాబు చెప్పేది కాదు. కాని, ఆయన మాటల్లోని అవహేళన ఆమెను రెచ్చగొట్టింది. "విచారం వల్ల నేను నిట్టూర్పు వదలలేదు. ఈ పర్వతాలపై వీచే చిరుగాలులు, యీ పచ్చటి మెత్తటి గడ్డి పరకలు యీ దేవదారు చెట్ల సువాసనలు, ఈ నదీ ప్రవాహపు గలగలలు అన్నీ గాంధార దేశాన్ని జ్ఞప్తికి తెస్తూ వున్నాయి. అలాంటి గాంధారం మళ్లీ దొరకలేదు కాబట్టి యీ నిట్టూర్పు, అంతే!" ఆ మాటలతో ఆమె మనస్సును కష్టపెట్టే ఆలోచనను ధృతరాష్ట్రుడు విడిచిపెట్టాడు. ఆమెపై జాలి కలిగింది. "గాంధారీ, నిజంగా ఒక గ్రుడ్డివానికి కట్టబెట్టడం వల్ల నీ జీవితం నాశనమైంది. కదూ? జీవిత పర్యంతం నీ తలిదండ్రులు, స్వగ్రామం గూర్చే ఎదురు తెన్నులు చూశావు గదూ!" దానికి గాంధారి "అదేమీ కాదు. మీతో పెండ్లి జరిగిన నాటి నుండి మా గాంధారానికి సంబంధించిన వూహలన్నీ అణగారి పోయాయి. ఈ రోజు గాంధారం గురించి జ్ఞాపకం తెచ్చుకుంటున్నానే తప్ప, అక్కడి మా వారిని గురించి కాదు. మీకు తెలుసు. నేను నా అన్నతో ఒకే యింట్లో వున్నప్పటికి ఆయనతో ఎప్పుడూ మాట్లాడనేలేదు." కొన్ని ఘడియలు నిశ్శబ్దంతో గడిచిపోయాయి. విదురుడు, కుంతి ఆశ్చర్యంతో చూస్తున్నారు. వారి సంభాషణ వారికి ఆవేదనను కలిగించింది. ధృతరాష్ట్రుని మాటల్లో హేళనా ధోరణి పోయింది. "నీవు మోసపోయావు నాకు గ్రుడ్డితనం వుందని నీకు చెప్పకుండానే నిన్ను నాకిచ్చి పెళ్లి చేశారు. గాంధారీ, మేము నీకు సంబంధించి వెయ్యి తప్పులు చేశాము. వాటిని తిరిగి నీవు చెల్లించావు. క్షమించి అన్నీ మరచి పోలేవా?" అలాంటి సంభాషణ వినడం మంచిది కాదనే వుద్దేశ్యంతో విదురుడు, కుంతి దూరంగా పోయేందుకు లేచి నిలబడ్డారు. అది పసిగట్టిన ధృతరాష్ట్రుడు "పోవద్దు, కూర్చోండి. మా భార్యాభర్తల మధ్య రహస్యమైం దేమీ లేదు. నీ అన్నగా ఆజ్ఞాపిస్తున్నాను. కూర్చో." వారు తిరిగి కూర్చోగానే ఆయన ఆవేశంతో "నిజంగా నన్ను ఘోరంగా శిక్షించావు గాంధారీ! నేను మొదట అలా అనుకోలేదు. పెళ్లి సమయంలో నీ కళ్లకు గంతలు కట్టినప్పుడు నేను అంతగా పట్టించుకోలేదు. ప్రేమద్వారా నీ కోపాన్ని పోగొట్టి, నిన్ను వేడుకుందామనుకున్నాను. అలా జరుగలేదు. నీవు మొట్టమొదట పడక గదికి వచ్చినప్పుడు కూడా కళ్లకు గంతలతో తడుముకుంటూ వచ్చావు. నేను పుట్టుగ్రుడ్డిని. కాని నీవు మాత్రం కావాలని కళ్లు మూసేసుకున్నావు. ఘోరమైనది ఆరాత్రి. ఆ రాత్రే నిన్ను ఎందుకు చంపలేకపోయానో అర్థం కాలేదు." దానికి గాంధారి కోపంతో "చంపి వున్నా బాగుండేది. దాంతో యీ చీకటి బ్రతుకు నుండి మనం తప్పుకునేవాళ్లం." ధృతరాష్ట్రుడు ఆవేశంతోనే "గాంధారీ! అలా మాట్లాడవద్దు. మా కౌరవులుఎంత బలహీనులుగా తయారైనా, మేము యింకా క్షత్రియులమే. స్త్రీలను చంపి మా మగతనాన్ని నిరూపించము. నేను రాజును. నే ననుకొంటే, నీ కళ్ల గంతలను ఎప్పుడో తీసివేయగలిగేవాణ్ణి. కాని,బలవంతంగా గాక, నిన్ను వొప్పించే ఆపని చేయాలనుకున్నాను. దానికి మొదటి రోజునే వ్యతిరేకత తెలిపావు. అదే శాశ్వతమైపోయింది. పిల్లలు కలిగిన తర్వాత గాంధారీ, నా కోసం కాకున్నా, పిల్లలను చూసేందుకైనా, నీ కళ్లకు గంతలు తీసివేయమని అడగాలనుకున్నాను. కాని అప్పటికే నా మనస్సు కఠినమైపోయింది. నేను ఒక వేళ ఆ అవకాశమిస్తే, పిల్లల కోసమైనా ఆ గంతలు తీసివేసే దానివేమో! కాని, నీవు పిల్లల ముఖాలను చూడకూడదనే ప్రతీకార వాంఛ ఎందుకో నాలో ఏర్పడింది. కళ్లగంతల తోనే విధేయురాలైన భార్య పాత్రను నిర్వహించావు. నీ చర్యల వల్ల నీకై నీవే సంకెళ్లు వేసుకున్నావు. నీ అంతట నీవు నీ కళ్లను తెరమకోలేవని నాకు తెలుసు. నా ఆజ్ఞవల్లనే ఆ పని జరుగుతుందని తెలిసినా, నేను అలాంటి దేమీ చేయలేకపోయాను. పిల్లలపై 'గ్రుడ్డి' ప్రేమతో మనం

దగ్గరయ్యాము. అంతవరకు నేను నీ వాణ్ణిగా నీవు ఎప్పుడూ భావించలేదు. మేము కౌరవులము. స్త్రీలకు ఎన్నో అన్యాయాలు చేశాము. 'అంబ' ఆగ్రహంలో భీష్ముడు దహించుకుపోయాడు. నాలో నేను యింకా దహించుకుపోతూనే వున్నాను. దానితోనే మన పిల్లలు నాశనమయ్యారు. కుంతిని కూడా ఒక అవిటి వాని కిచ్చి పెళ్లి చేశారు. అయితే, భర్త జీవించి ఉన్నంతవరకు, ఆమె ఆయనకు నమ్మకమైన భార్యగా ప్రవర్తించింది. భర్త మరణానంతరం పిల్లల సంరక్షణ చేబట్టింది. ప్రతి వ్యక్తి అన్యాయాల వలలో చిక్కుకొని పోతూ వుంటారు. నేను నీకు అన్యాయం చేశాను పాండురాజు కుంతికి అన్యాయం చేశాడు. పాండురాజు, నేను యిలాంటి నిర్జీవ జీవితాలను గడిపేందుకు కారకులు ఎవరు? మా తల్లులకు జరిగిన అన్యాయాలు, వారు అనుభవించిన నికృష్ట జీవితాలు మాకు శాపాలుగా మారాయా? విదురుడు ఒక్కడే శారీరకంగానూ, మానసికంగానూ పూర్తి ఆరోగ్యంతో వున్నాడు. మా తండ్రి ఆయనకు కూడా తండ్రే. అయితే ఆయన తల్లి ఒక సేవకురాలు. అందువల్లనే, ఆయన రాజు కాలేకపోయాడు. అంత మాత్రాన ఆయన ఎవరిపైనా పగ సాధించలేదు. మన కుంటుంబం మొత్తంలో కుంతి, విదురుడు యిద్దరే జాగ్రత్తగా వున్న వ్యక్తులు. గాంధారీ, నిన్ను మోసం చేశారని అనుకుంటున్నావు. కాని, మా కుంటుంబంలోని మూడు తరాల్లోనూ ప్రతి ఒక్కరూ మోసపోయారనే విషయం నీవు జ్ఞాపకం వుంచుకోవాలి. నన్ను క్షమించమని అడుగుతున్నాను. ఈ జీవితాన్ని ఎదిరించే నీ పోరాటాన్ని ఆప మని కోరుతున్నాను.

నేను నీకు చేసిన అన్యాయంతో నీజీవితానికి, నీ పిల్లల జీవితాలకు అన్యాయం చేసే హక్కు నీకు లేదు. గాంధారీ, ఒక అన్యాయం ఇంకొక అన్యాయానికి ఎలా పరిష్కారమార్గ మౌతుంది? ఇప్పటికైనా, నీ కళ్ల గంతలు తీసివెయ్యి. ప్రపంచాన్ని కళ్ల గంతలతో మాత్రం చూడవద్దు." ధృతరాష్ట్రుడు అంతకంటె ఎక్కువగా మాట్లాడలేకపోయాడు. "నేను కళ్లు తెరిచాను. చూడు. నాకేమీ స్పష్టంగా కనిపించడం లేదు" అని గాంధారి పలికింది. తన జీవితంలో మొట్టమొదటి సారి ధృతరాష్ట్రుడు గాంధారి చేతులు గట్టిగా పట్టుకొని పిల్లవాని మాదిరి ఏడ్చాడు.

కురువంశంలో ధృతరాష్ట్రుడు, గాంధారి జంట మాత్రమే సంతోషంలోనూ, దు:ఖంలోనూ పాలు పంచుకున్న వ్యక్తులు. విదురుడు, కుంతి ప్రేక్షకుల మాదిరి చూస్తూ వుండిపోయారు. కాని యీనాడు ఆ ప్రేక్షకులే పాత్రలుగామారారు. వారి కళ్లలో నీళ్లు తిరిగాయి. ఉద్రేకాన్ని అణచుకొని ధృతరాష్ట్రుడు మెల్లగా యిలా అన్నాడు "గాంధారీ, కుంతి సహాయంతో ఒకటి రెండు రోజుల్లో నీవు చూడడం నేర్చుకుంటావు. నీవు స్పష్టంగా చూడగలిగిన రోజున నన్ను తిరిగి యిక్కడకు తీసికొని వచ్చి కూర్చోబెట్టు." ఆ తర్వాత ఎవరూ మాట్లాడలేదు. ఆశ్రమంలో కూడా అందరూ మౌనంగా తమ తమ ఆలోచనల్లో నిమగ్నమైపోయారు.

రెండు రోజులు గడిచిపోయాయి. గాంధారి కళ్లతో చూడగలిగింది. ధృతరాష్ట్రుని చెయ్యి పుచ్చుకొని, యిది వరకటి చోటున కూర్చోబెట్టింది. విదురుడు, కుంతి చెంతనే కూర్చున్నారు. గాంధారి చెయ్యి పుచ్చుకొని ధృతరాష్ట్రుడు "గాంధారీ! నీవు నాకన్న చిన్నదానివి. నేను పోయినప్పటికి నీఅంతట నీవు బ్రతకగలుగుతావు' ' అన్నాడు. ఆ మాట వింటూనే గాంధారి భర్త పెదవులపై చేయి నుంచి, "కూడదు. అలాంటి దెప్పుడూ జరుగకూడదు. మీపై వుంచిన నా చేతులు ఎప్పుడూ విడిపోకూడదు. నేను కళ్లు తెరిచానంటే, అది నా ఒక్క దానికోసం కాదు. మనిద్దరికోసం" అని అంది. ఆ తర్వాత ధృతరాష్ట్రుడు మాట్లాడలేకపోయాడు. ఇప్పుడు తన మనస్సు ప్రశాంతంగా వుంది. కొద్దిసేపటి తర్వాత "గాంధారీ, నీవు చూడలేని దానిని నేను వాసన ద్వారా తెలుసుకోగలుగుతున్నాను. చూడు ఎక్కడో అడవి కాలి పోతున్నట్లుంది. ఈ రోజు వుదయం నుండి పొగవాసన నాకు తగులుతూనే వుంది. భయంతో పరిగెత్తే జంతువుల అరుపులు నాకు వినబడుతున్నాయి. ఎక్కడో మన

వెనుక వైపు అడవి కాలిపోతూ వున్నట్లు నా కనిపిస్తూంది. దాని వేడి మనకు తగలలేదు కాబట్టి మనకు దగ్గరగా లేనట్లుతోస్తూంది. ఎక్కడ కాలుతూందో చూడు." విదురుడు, కుంతి కూడా లేచి చుట్టు ప్రక్కల చూశారు. అవును. దూరంలో పొగ కనిపిస్తూ వుంది. ఆ తర్వాత ఎర్రని, పచ్చని అగ్నిజ్వాలలు కదలుతూ కనిపించాయి. అందరూ మళ్లీ కూర్చున్నారు. "మహారాజు చెప్పింది నిజమే. మంటలు ఆమడ లోపలే వున్నాయి" అని గాంధారి అంది. అప్పుడు ధృతరాష్ట్రుడు "గాంధారీ! ఆఖరువరకు నా చెయ్యి పట్టుకొని వుండడం నీవు అనుకున్నంత తేలిక కాదు. చావును ఎదురుచూస్తూ బతకడంతో నేను విసిగి పోయాను. ఐదునెలలకో, ఆరునెలలకో యువరాజులు యిక్కడకొచ్చి మన కష్టాల నన్నింటిని జ్ఞాపకం చేసి వెళ్తారు. ఆ తర్వాత మనో వ్యాకులత పోయేందుకు ఎంతో కాలం పడుతుంది. నీవు యీ నదిని దాటి మంటలనుండి తప్పించుకొని వెళ్లిపో!" వెంటనే ధృతరాష్ట్రుని చేయి గట్టిగా నొక్కి గాంధారి "రాజా, నేను నిన్ను వదలి ఎక్కడకూ పోను. రా! ఆ అగ్నికోసం ఎదురుచూచేబదులు మనమే దానివైపు వెళ్దాము" అని అనేటప్పటికి, "నీవు చెప్పిందే సమంజసం గాంధారీ!' ' అంటూ ధృతరాష్ట్రుడు లేచి నిలబడ్డాడు. వారిద్దరూ కలిసి అగ్నికేసి నడక సాగించారు. వెనుకనే విదురుడు, కుంతి రావడం గమనించి, "మీరు కూడానా ......" అంటూ ధృతరాష్ట్రుడు ముందుకు నడిచాడు.

ఒక వైపరీత్యం జరిగిపోతూ వుంది. ఒక 'సతి' బ్రతికున్న తన భర్త చేయి పుచ్చుకొని చితివైపు వెళ్తూ వుంది. తన అన్న విధవను అగ్నిజ్వాల నుండి తప్పించడం పోయి, మరది (విదురుడు) ఆమెతో పాటు అగ్ని వైపు పోతున్నాడు.

# PROZAC

## Prescriptions for Happiness?

The air is filled with declarations and advertisements of the power of biological psychiatry to relieve people of their psychological distress Some biological psychiatrists are so convinced of the superiority of their position that they are recommending young psychiatrists no longer be taught the essentials of doing psychotherapy Feature stories in such magazines as *Newsweek* and *Time* have portrayed drugs like Prozac as possessing almost a mystical potency The best-selling book *Listening to Prozac* by psychiatrist Peter Kramer, M D, projects the idyllic possibility that psychotropic drugs may eventually be capable of correcting a spectrum of personality quirks and lacks.

As longtime faculty members of a number of psychiatry departments, we have personally witnessed the gradual but steadily accelerated dedication to the idea that "mental illness" can be mastered with biologically based substances Yet a careful sifting of the pertinent literature indicates that modesty and skepticism would be more appropriate responses to the research accumulated thus far In 1989, we first raised radical questions about such biological claims in a book, *The Limits of Biological Treatments for Psychological Distress Comparisons with Psychotherapy and Placebo* (Lawrence Erlbaum) Our approach has been to filter the studies that presumably anchor them through a series of logical and quantitative (meta-analytic) appraisals

# ఉయ్యాలవాడ నరసింహారెడ్డి

- జానమద్ది హనుమచ్ఛాస్త్రి

వ్యాపారులుగా వచ్చి మన దేశాన్నే ఆక్రమించుకొన్న ఆంగ్లేయులను తరిమి వేయటానికి 1840 లోనే, సిపాయి పితూరీ అనబడిన 'ప్రథమ భారత స్వాతంత్ర్య సమరానికి 17 ఏళ్ల ముందుగానే, ఉద్యమించిన స్వాతంత్ర్య వీరుడు ఉయ్యాలవాడ నరసింహారెడ్డి.

జానపదుల గాథలలో; సి.పి. బ్రౌన్ తెలుగు వారి నుండి అందుకొన్న జాబుల్లో, ఇతర చారిత్రక పత్రాల్లో దాగిన చారిత్రకాంశములను సేకరించిన బంగోరె (బండి గోపాల రెడ్డి) 'బ్రౌన్ జాబుల్లో స్థానిక చరిత్ర శకలాలు - కడప జాబుల సంకలనము' (శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయ ప్రచురణ, 1977) అన్న గ్రంథంలో నరసింహారెడ్డి తిరుగు బాటును గురించి పలు అంశాలను వెల్లడించారు.

నేటి కర్నూలు జిల్లాలోని ఉయ్యాలవాడ జాగీర్దార్ పెదమల్లారెడ్డి. అతని ముగ్గురు కొడుకుల్లో కడపటి వాడు నరసింహారెడ్డి. కోయిల కుంట్ల తాలూకాలోని ఉయ్యాలవాడ జాగీర్ ఆంగ్లేయుల వశమయ్యేనాటికి, ఆ జాగీర్ నుండి ఏటా ముప్పది వేల రూపాయల రెవెన్యూ రాబడి వుండేది. జాగీర్‌ను స్వాధీన పరచుకొని కంపెనీ ప్రభుత్వం పెదమల్లారెడ్డి కుటుంబానికి నెలకు 70 రూపాయల పింఛను ఏర్పాటు చేసింది. అందులో పెదమల్లారెడ్డి తమ్ముడు చినమల్లారెడ్డికి సగం పోగా మిగిలిన సగం 35 రూపాయల్లో నరసింహారెడ్డికి మూడో వంతుగ రూ. 11.10.8 మాత్రమే పింఛన్‌గా వచ్చేది. నరసింహారెడ్డి మాతామహుడైన నొసం జమీందార్ జయరామరెడ్డికి, ఏటా 22 వేల రెవెన్యూ వచ్చే జాగీర్‌ను స్వాధీనం చేసుకొని, నెలకు వేయి రూపాయల భరణం ఇచ్చేవారు. నొసం జమీందార్ నిస్సంతుగా మరణించడంతో కలెక్టర్ మన్రో భరణం ఆపేసాడు.

కంపెనీ ప్రభుత్వం క్రమంగా కట్టుబడి మాన్యాల వంశ పారంపర్య హక్కును రద్దు చేసి వారి మాన్యాలను స్వాధీన పరచుకోసాగింది. నరసింహారెడ్డి తనకు వచ్చే పింఛన్ కోసం తన బంట్రోతును కోయిలకుంట్ల తహసీల్దార్ వద్దకు పంపగా, ఆ తలబిరుసు తహసీల్దార్ ఈసడించుకొని, బంట్రోతును తిప్పి పంపాడు. ఈ తిరస్కృతి నరసింహారెడ్డి కోపానలాన్ని ప్రజ్వలింప చేసింది.

మాన్యాలు కోల్పోయిన కట్టుబడి దార్లను, మరి కొందరు కొండ జాతుల వారిని నరసింహారెడ్డి సమీకరించుకొన్నాడు. తెల్లవారి పై తిరుగు బాటు జెండా ఎగురవేసాడు. కంపెనీ ప్రభుత్వం నరసింహారెడ్డిపై నిఘా వేసింది.

1846 జులై 7వ,8వ తేదీలలో (కావచ్చు) నరసింహారెడ్డి దళం చాగల మర్రి తాలూకా రుద్రవరం గ్రామంపై బడింది. పోలీసులు, ప్రభుత్వం తరఫు మనుషులు నరసింహారెడ్డి దళంతో మిట్టపల్లి వద్ద తల పడ్డారు. ఆ పోరాటంలో నరసింహారెడ్డి మనుషులు హెడ్‌దఫేదారును, మరో తొమ్మిది మంది బంట్రోతులను చంపివేసి, వారి వద్దవున్న ఆయుధాలను లాక్కొని పరారైనారు.

నరసింహారెడ్డి బృందం 1846 జులై 10 వ తేదీన కోయిల కుంట్ల ట్రెజరీపై బడి అందున్న రు.805-10-4 పైసల డబ్బును వూడ్చుకుపోయారు. తహసీల్దార్ రాఘవాచారిని బందీగా పట్టుకొన్నారు.

ఈ వార్త విన్న కలెక్టర్ కాక్రేన్ హడలిపోయి బళ్ళారి నుండి సైన్యాన్ని రప్పించాడు.

మొదట్లో అందిన అంచనాల మేరకు నరసింహారెడ్డి నాయకత్వంలో 9 వేల మంది చేరి వుండ వచ్చు ననుకొన్నారు. వనపర్తి జమీందార్ రాజా రామేశ్వరరావు, మునగాల రామకృష్ణారెడ్డి, జటప్రోలు సంస్థానాధిపతి లక్ష్మణ రాయుడు, పెనుగొండ, ఔకు జమీందార్లు, హైదరాబాద్‌కు చెందిన సలామ్‌ఖాన్, కర్నూలుకు చెందిన పాపాఖాన్, బనగానపల్లె నవాబ్ మహమద్ అలీఖాన్ మొదలగు వారు అండగా వున్నారని ముఖ్యంగా కట్టుబడి బంట్రోతులు, చెంచువాళ్ళు, వడ్డెవాళ్ళు, బోయవాళ్ళు, యానాదులు కొందరు బ్రాహ్మణులు నరసింహారెడ్డి మురాలో చేరి వున్నారని, కొందరు అరబ్బులు కూడా పరోక్ష సహాయం అందిస్తున్నారని అభిప్రాయపడ్డాడు కలెక్టర్.

కోయిలకుంట్ల ట్రెజరీ దోచుకొన్న తర్వాత జమ్మలమడుగు ఖజానాను కొల్లగొట్టా లనుకొన్నారు. కాని మిలిటరీ దళాలు నాలుగు వైపుల నుండి వస్తున్నాయని తెలుసుకొని, ఆ ఆలోచన మానుకొన్నారట. కంబం నుండి వస్తున్న వాట్సన్ నాయకత్వంలోని సైనిక బృందం గిద్దలూరు వద్ద నరసింహారెడ్డితో తలపడింది. కేవలం వందమంది సైనికులు, కొందరు బంట్రోతులతో వాట్సన్ చక్కని వ్యూహం పన్నాడు. ఈ పోరాటంలో నరసింహారెడ్డి మనుషులు 200 మంది దాకా చనిపోయారు. నలుగురు సిపాయిలు మరణించారు. నరసింహారెడ్డి తప్పించుకొని తన బృందాన్ని మరోచోటికి మళ్ళించాడు. అది అర్ధ రాత్రి వేళ.

24 వ తేదీన ముండ్లపాడు వద్ద ఆంగ్ల సైన్యం నరసింహారెడ్డి బృందాన్ని ఎదుర్కొంది. ఒక సిపాయి చచ్చాడు. రెడ్డి బృందంలో 15 మంది మరణించారు. 10 మంది బందీలయ్యారు. ఈ పోరాటంలోనే నరసింహారెడ్డి మనుషులు కంబం తాసీల్దార్ శ్రీనివాసరావును కాల్చేశారు.

ఒక వైపు సుశిక్షితమైన సైన్యం, ఆయుధ సామగ్రి; మరొకవైపు ఆయుధాలు అంతగా లేని, దూసుకుపోయే దళాలు. నరసింహారెడ్డి మనుషులకు కొండలు, కోనలు, రహస్య మార్గాలు బాగా తెలుసు.

బందీలుగా పట్టుకొన్న వారిని దొరలు చిత్రహింసలు పెట్టారు. చాలా మంది ఇనాందార్లను జైళ్ళలో వేసి హింసించారు. నరసింహారెడ్డి అన్న కుమారుడు మల్లారెడ్డి పినతండ్రికి వ్యతిరేకంగా బ్రిటిష్ వారి తొత్తు అయ్యాడు.

నరసింహారెడ్డి కొత్తకోటలోని తన మామ ఇంట్లో పెళ్ళాం బిడ్డలను, తల్లిని వదలిపెట్టి వెళ్ళాడు. (రెడ్డికి ముగ్గురు భార్యలు, మొదటి భార్యకు 16 ఏళ్ళ కొడుకు, రెండో భార్య ద్వారా ఒక కూతురు, మూడో భార్యకు ఇద్దరు కొడుకులు, తల్లీ, అత్తా, మామా - ఇదీ ఆయన కుటుంబం) పెద్ద కొడుకు ఎట్లో తప్పించుకొన్నాడు. మిగతా కుటుంబ సభ్యులందరినీ కడపకు తీసుకువెళ్ళి అక్కడొక బంగాళాలో నిర్బంధించి, మిలిటరీ పారా వుంచారు.

నరసింహారెడ్డికోసం ముమ్మరంగా గాలించారు. అనుమానితు లంటూ 600 మందిని జైళ్ళకు పంపారు.

నరసింహారెడ్డిని పట్టి ఇచ్చినవారికి 2 వేల రూపాయల బహుమానం ప్రకటించారు. రెడ్డి సహచరులు గోసాయి వెంకయ్య, కరణం అశ్వత్థామ, దాసరి రోశిరెడ్డి, జంగం మల్లయ్య మొదలగు వారిని పట్టుకొన్న వారికి బహుమతు లిస్తా మన్నారు.

1846 అక్టోబరు 6 న నరసింహారెడ్డి పట్టుబడ్డాడు. ఎర్రమల - నల్లమల కొండల మధ్య నున్న జగన్నాథ దేవళంలో నరసింహారెడ్డి వున్నాడని తెలుసుకొన్నారు. కొండల చుట్టూ సైన్యం పెట్టి తుపాకుల వర్షం కురిపించారు. ఈ కాల్పుల్లో నరసింహారెడ్డి మనుషులు 40-50 మంది మరణించారు. 90 మంది పట్టుబడ్డారు. వందమంది దాకా గాయపడ్డారు. కొదమసింగం లాంటి నరసింహారెడ్డి కాలికి గుండు దెబ్బ తగిలింది. మూడు నెలల అరాచకం మూడు నిమిషాల్లో అంతమైం దన్నాడు కలెక్టర్. నరసింహారెడ్డిని బంధించారు.

కేసు నడిచింది. మొత్తం 901 మంది మీద నేరారోపణ జరిగింది. వీరిలో 412 మందిని నేరం రుజువు కాలేదని వదలి వేశారు. 273 మందిని స్పష్టమైన సెక్యూరిటీ తీసుకొని వదిలిపెట్టారు. 112 మందికి కఠిన శిక్షలు పడ్డాయి. - 14 ఏళ్ళ నుండి 5 ఏళ్ళ దాకా జైలు శిక్ష పడింది. కొందరిని అండమాన్ ద్వీపాలకు పంపారు. వారిలో ఔకు రాజా తమ్ముడు ఒకడు.

నరసింహారెడ్డికి 1847 జనవరి 9 న ఉరిశిక్ష విధించారు.

1847 ఫిబ్రవరి 22వ తేదీన కలెక్టర్ కాక్రేన్ సమక్షంలో సోమవారం ఉదయం 7 గంటలకు రెండు వేల మంది ఎదుట అతనిని ఉరితీశారు.

నరసింహారెడ్డి తల 1877 దాకా కోయిలకుంట్ల దగ్గర బురుజుపై వేలాడుతూ వుండేది. ఇతరులకు హెచ్చరికగా అలా వుంచారు.

కేవలం దేశభక్తియే పెట్టుబడిగా, ఆత్మత్యాగమే బలంగా కంపెనీ దొరతనాన్ని ఎదురుకొన్న స్వాతంత్ర్య వీరుడు నరసింహారెడ్డి. రెడ్డి జీవిత చరిత్రను కావ్యంగా రాసిన పాణ్యం నరసరామయ్యగారు ఆ వీరుని చిత్రిస్తూ :

*అతని జీవాత్మ భౌతికమైన తనువు*
*వదలి యంతట వ్యాపించి మహోద్య*
*మమ్ము-లొనరించియొక శతాబ్దమ్మునకును*
*మాతృభూమికి స్వాతంత్ర్య మహిమ గూర్చు"* అన్నారు.

దేశస్వాతంత్ర్యానికి ప్రాణాలర్పించిన ఉయ్యాలవాడ నరసింహారెడ్డి వీరగాథ జానపద గాయకుల నోళ్ళలో నేటికీ నృత్యం చేస్తున్నది. ●

## Drugs and Human Biology

1. Vivid differences between the body sensations of drug and placebo could signal to patients whether they are receiving an active or inactive agent
2. A patient's attitude toward the therapist is just as biological in nature as a patient's response to an antidepressant drug
3. Administering a therapeutic drug is not simply a medical, biological act It is also a complex social act, its effectiveness mediated by the patient's expectations
4. If a stimulant drug is administered with the deceptive instruction that it is a sedative, it can initiate a physiological response characteristic of a sedative, such as decreased heart rate

సమీక్షా వ్యాసం

# య యా తి

**మూలం : జ్ఞానపీఠ అవార్డు గ్రహీత ఖండేకర్      సమీక్షకుడు : ఎస్.సదాశివ**

*(జ్ఞానపీఠ పురస్కృతికి పాత్రమైన 446 పుటల మరాఠీ నవల 'యయాతి'ని నాలుగు భాగాల్లో కుదించి మూడే మూడు ముఖ్య పాత్రల స్వగతాల రూపంలో మొత్తం కథ చెప్పించాడు ఖాండేకర్. ఆ మూడు ముఖ్య పాత్రలు యయాతి, దేవయాని, శర్మిష్ఠలు. ఇక్కడ కొంత కథ క్లుప్తంగా సమీక్షిస్తున్నాను. 188 పుటల వరకు విస్తరించిన కథను 15 పుటల్లో సంక్షిప్తపరచవలసి వచ్చినప్పుడు ఖాండేకర్ వాక్యాలన్నిటిని యధాతథంగా గ్రహించే అవకాశం ఎలాగూ వుండదు. నడుమ నడుమ నా మాటల్లో చెప్పక తప్పలేదు. అయితే, నా మాటలు నా మాటలేకావు. ఖాండేకర్ మాటల సారాంశాన్నే నా మాటల్లో చెప్పాను. కొన్ని భాగాలు తొలగించి మళ్లీ జోడించేటప్పుడు మాత్రం నా మాటలతో అతుకులు పెట్టాను. ఉత్తమ పురుషలో రాయబడిన రచనలను కుదించేటప్పుడు ఈ పద్ధతే శరణ్యం. రెండు, మూడు భాగాలు ఫిబ్రవరి, మార్చి సంచికలలో ప్రచురింపబడును.)*

"నా కథను ఎందుకు చెప్తున్నాను? నాకే తెలియదు. రాజును కనుక చెప్తున్నానా? ఒకప్పుడు రాజునే! రాజుల రాణుల ఇతివృత్తాలు ప్రజలు ఆసక్తితో వింటారు. వాళ్ల ప్రేమ కథలు గొప్పగొప్ప కవులు కావ్యాలుగా రాస్తారు. నాదీ ప్రేమ కథే! కానీ ఇదెలాంటి ప్రేమ? దీన్ని కావ్యంగా రాయాలని ఏ కవీ అనుకోడు. రాజునైనందుకు నాకు అభిమానం లేదు. అహంకారం లేదు. ప్రదర్శించుకోవాలన్న ఆసక్తీ లేదు. చిరిగిన రాజవస్త్రాల పేలికలను ప్రదర్శించుకోవటంలో ఏమున్నది? రాజవంశంలో పుట్టినాను గనక రాజునై నాను. ఇందులో నా గుణదోషాల ప్రమేయం లేదు. భగవంతుడు నన్ను హస్తినాపురమహారాజు నహుషుని కొడుకుగా జన్మింపజేశాడు. తండ్రి తరువాత అతని సింహాసనం మీద కూర్చున్నాను. ఇందులో నా గొప్ప ఏమిటి? రాజప్రాసాదం మీద కూర్చున్న కాకిని సైతం లోకులు కుతూహలంతో చూస్తారు.

మరి ఎందుకు చెప్తున్నాను నా యీ కథను? దీన్ని విని ఎవరయినా గుణపాఠం నేర్చుకుంటారనా? అదొక ఆత్మవంచన. ప్రజలు దోషాలు చేస్తారు. దోషాల గురించి వింటారు. కానీ ఎలాంటి గుణపాఠం నేర్చుకోరు. మనసులోని వ్యధను వెళ్లబోసుకుంటే ఉపశమనం కలుగుతుందని చెప్తున్నానా? సానుభూతిని ఆశించి చెప్తున్నానా? ఏమో!"

ముందు వెనకల కీకారణ్యం. భయంకరమైన అంధకారం. అప్పు డప్పుడు మిణుకు మిణుకు మనే చుక్కల సన్నటి కాంతి కాలిబాట మీద ప్రసరిస్తుంటుంది. ఆ కాలిబాట వెంట సాగే మానవుని యాత్రనే జీవిత మంటారు. నా జీవిత యాత్రలోనూ చెప్పుకోదగ్గ కొన్ని చీకటి వెలుగుల ముచ్చట్లు లేక పోలేదు. బాల్యంలోని యయాతి; కిశోరావస్థలోని యయాతి; యవ్వనంలోని యయాతి; ఇప్పుడీ జీర్ణశీర్ణ శరీరంలో వున్న యయాతి; అందరూ ఒక్కడే. అయితే వాళ్లు చూడలేనిది ఈ యయాతి చూడగలుగుతున్నాడు. మళ్లీ చీకట్లో పడిపోకుండా జాగృతపరచాలనే ఉద్దేశ్యంతోనే తన ఆత్మకథను చెప్తున్నాడు ఈ యయాతి.

★ ★ ★

ఈలాటి ప్రశ్నలతో ప్రారంభించి యయాతి తన ఆత్మకథా కథనం సాగిస్తాడు.

నెమలిపురిలోని రంగుల్లాంటి బాల్యస్మృతులు. పూలంటే వల్లమాలినవ్యామోహం. రాజప్రాసాదాన్ని ఆనుకొని

అనుకొని వున్న ఉద్యాన వాటికలో వివిధ వర్ణాలతో వికసించిన పూలవైపే చూస్తూ కూర్చునేవాణ్ణి. అన్నింటినీ ఆస్వాదించవలెననే లాలస. రాత్రిళ్లు నన్ను నిద్రపుచ్చటం దాసీలకు దుస్తరమయ్యేది. "తోటలోని పూలన్నీ తెచ్చి నా పానుపు మీద పేర్చండి. పడుకుంటాను" అన్నానట ఒకనాడు. ఆ దాసి నవ్వుకుంటూ ఇంకోదాసికి చెప్పింది. ఇంకోదాసి ఇంకో దాసికి. ఇలా అమ్మదాకా చేరిందామాట. "విన్నారా! మన యయు ఏమంటున్నాడో? తోటలోని పూలన్నీ కోసి పాన్పు మీద పేర్చాలట! వీడు కవి అయ్యేటట్లున్నాడు" అని నాన్నగారితో నవ్వుతూ చెప్పింది అమ్మ. ఆ మాటకు నాన్నగారు ఏవగింపుగా మొఖం పెట్టి, "కవి అయి ఏమి సాధిస్తాడు వాడు? మా లాటి వీర పురుషుడు కావాలె. లోకంలోని సౌందర్యాన్ని కవి వర్ణిస్తాడు. వీరపురుషుడు అనుభవిస్తాడు. మా పూర్వజుడైన పురూరవుణ్ణి ఊర్వశి వరించి వచ్చింది. నేను దేవరాజును పదభ్రష్టుణ్ణి చేసి ఇంద్రభోగా లనుభవించాను. నా కొడుకూ మాలాంటివాడే కావాలి" అన్నారు

అంతకంటే ముందటి జ్ఞాపకాలు కొన్ని. అగ్నిశాలలోని మంటల్లోంచి ఎగసిపడే నిప్పు రవ్వల్ని "పూలూ పూలు" అని అందుకోవటానికి పరిగెత్తేవాణ్ణట. "వెర్రివాడివిరా యయూ! పూలకూ, అగ్నికణాలకూ తేడా తెలియదు నీకు. అగ్నిరవ్వలను ఎక్కడ పట్టుకుంటావో అని భయపడేదాన్ని" అన్న దొకనాడు అమ్మ.

నా కప్పుడు ఆరేళ్లు. మా అమ్మకు ఇష్టురాలైన దాసి కళిక. ఆమెపట్ల నాకూ మమకారమే. ఒకనా డామె నన్నెత్తుకొని గట్టిగా తన ఎదకు అదిమి పట్టుకున్నది. నేను గిల్లీ రక్కీ విడిపించుకున్నాను. అప్పుడు నా ఈడేగల ఆమె కూతురు, అలక కూడా అక్కడే వున్నది. "యువరాజా! మొన్న మొన్నటిదాక ఆకలైతే పాలకోసం ఈ కళిక కావలసి వచ్చేది. ఇప్పు డిలా గింజుకుంటున్నారు" అన్నది కళిక. "నేను నీ పాలు త్రాగి పెరిగానా? అమ్మపాలు త్రాగలేదా?" అని అడిగాను. "రాణులు తమ పిల్లలకు పాలిస్తే వాళ్ల శరీర సౌష్టవము, సౌందర్యము తగ్గిపోవా? ఇదిగో నా కడుపున పుట్టిన ఈ ఆలకకు పై పాలు త్రాగించి మీకేమో నాపాలు త్రాగించాను" అన్న దామె. మొదటిసారి అమ్మమీద నాకు కోపం వచ్చింది. "అమ్మకు కూడా ఇంత స్వార్థమా? ఆమె నన్ను ప్రేమించటం లేదు. తన సౌందర్యాన్నే తాను ప్రేమించుకుంటున్నది" అనుకున్నాను. ఆ దినమంతా అమ్మతో మాట్లాడలేదు. అలిగి పడుకున్నాను. రాత్రిపూట, "రాజా! యయూ!, అంటూ అమ్మ నామీద చేయివేసి నిమురసాగింది. మాటలువ్యక్తం చేయలేని భావాన్ని వ్యక్తం చేసే శక్తి స్పర్శ కున్నది. కానీ మనస్సును తాకే శక్తి దానికి లేదు. ఆ శక్తి కన్నీటి కున్నది. నా మీద రెండు కన్నీటి చుక్కలు రాలాయి. కోపం పటాపంచలయింది. "ఏమైందమ్మా! ఎందుకేడుస్తున్నావు?" అని ఆదుర్దాగా అడిగాను. రాజమహల్లో ఎవరి చెవిలోనూ పడగూడదని నాన్నగారు కఠినంగా శాసించిన రహస్యాన్ని అప్పుడు చెప్పింది అమ్మ. నా చిన్నతనంలో అంగీరస మహర్షి ఆశ్రమంలోంచి ఎవరికీ చెప్పకుండా అర్థరాత్రి ఎటో వెళ్లిపోయిన మా అన్న యతి గురించి. అంతవరకు నాకో అన్న ఉన్నాడన్న సంగతి తెలియదు. అంగీరస మహర్షి వరప్రసాదాన పుట్టినవాడట. ప్రతి సంవత్సరం మా అన్న జన్మదిన సందర్భాన ఆ మహర్షి ఆశ్రమానికి వెళ్లటం ఆచారమయింది. అలా వెళ్లినప్పుడే ఒక అర్థరాత్రి మా అన్న అడవుల్లో పడి పారిపోయాడు. ఎంత వెదికించినా ప్రయోజనం లేకపోయింది. చెప్పగూడని ఈ రహస్యం చెప్పి "యయూ! ప్రొద్దుటి నుంచి చూస్తున్నాను ఎందుకో అలిగివున్నావు. నువ్వూ ఈ అమ్మమీద అలిగి వాని లాగా వెళ్లిపోతావా? నన్ను విడిచి వెళ్లనని శపథం చేయరా" అని దీనంగా వేడుకున్నది అమ్మ. "నిన్ను విడిచి ఎటూ వెళ్లనమ్మా!" అని మాటిచ్చాను. బాల్యంలో వర్తమానమే నిజ మనిపిస్తుంది. భూతభవిష్యత్కాలాల గురించిన ఆలోచన వుండదు.

ఆరేళ్లు వచ్చిన తర్వాత రాజకుమారులకు అవసరమైన సమస్త విద్యలూ నేర్పించారు నాకు. ఏడెనిమిదేళ్లలో అన్ని విద్యలూ నేర్చుకున్నాను. ఒక సంవత్సరం ఆశ్రమంలో గడుపాలని అమాత్యులు నాన్నగారికి సూచించారు. " ఔను.మొక్క ఎదుగటానికి సూర్యరశ్మి కూడా అవసరమే!" అన్నారు నాన్నగారు. అడవుల్లో, పూరిగుడిసెల్లో

వల్కలాలు ధరించి విభూది పూసుకొని, రుద్రాక్షమాలలు వేసుకొని, గడ్డాలూ మీసాలూ జటాజూటాలతో వుండే బుషుల మధ్య ఒక సంవత్సరం గడపటం దుర్భర మనిపించింది. నాన్న ఎంత చండశాసనుడైనా అమ్మగుప్పిట్లో వున్నా డన్న సత్యం మర్నాడే తెలుసుకున్నాను. మర్నాడు అమాత్యులు నా ఆశ్రమ వాసాన్ని గురించి ప్రస్తావించగానే, "మహారాణిగారికి యయును ఆశ్రమానికి పంపటం సమ్మతం కాదు." అనేశారు నాన్నగారు. ఒక గండం గడిచింది. ఒక గండాన్ని తప్పించిన అమ్మ ఇంకో గండం తగిలించేట్లు కనబడింది.

పడుచు వాణ్ణయిన నేను నా అవయవ సౌష్ఠవాన్ని, పురుష సౌందర్యాన్ని పరిశీలిస్తూ నిలువుటద్దం ముందు నిల్చున్నాను. తలుపు తోసుకొని లోనికి ప్రవేశించిన అమ్మ, "స్త్రీలే తమ అందాలను చూచుకుంటా రంటారు. మీరు కూడా..." అంటూ నా ముఖం చూచి గతుక్కుమని ఆగి పోయింది. నన్ను నాన్న గారనుకొని వుంటుందామె. నన్ను చూచి హర్షపులకితురా లయింది. ఆమె కళ్లు ఆనందాశ్రువులతో నిండి పోయాయి. "ఎంత ఎదిగి పోయావురా యయూ! నేడు నా చింత తీరింది." అన్నది తృప్తిగా. "నీకు చింతేమిటమ్మా! మహారాణివి."' అన్నాను. "నేను తల్లినిరా. తల్లి చేతిలోని ఒక కలశం విషకలుషిత మైతే రెండో కలశాన్ని ఎలా కాపాడుకోవాలా అని తల్లి మనసు ఎలా తల్లడిల్లు తుందో నువ్వెట్లా గ్రహించ గలవు? నీ పెళ్ళి చేస్తినా నా చింత పూర్తిగా తీరినట్లే" అన్న దామె. "ఇప్పుడే పెళ్లేమిటమ్మా! ఎన్ని దిగ్విజయాలు చేయాలె! ఎందరు దానవుల్ని సంహరించాలె! ఎన్ని అశ్వమేధయాగాలు చేయాలె!" అన్నాను. అమ్మ పేలవంగా నవ్వి "చిన్నవాడే నీ చేయి చూచిన దైవజ్ఞుడు ఈ బాలుడు గొప్ప అదృష్ట జాతకుడు, మూర్ధాభిషిక్తుడౌతాడు. అన్ని సుఖాలితనికి లభిస్తాయి. కాని ఇతనికి సుఖించేయోగం లేదు. అన్నాడు. నువ్వు నిజంగా సుఖిస్తుండగా చూడాలని వున్నది రా" అన్నది. "అతనొక వెర్రివాడు. అన్ని సుఖాలు లభించినా సుఖించే యోగం లేదనటంలో ఏమైన అర్థ మున్నదా? ఎందుకమ్మా నీకీ భయం?" అని సముదాయించాను. అమ్మకేమో నా పెళ్లి చేయాలనే తొందర. నాకేమో నా శౌర్య ప్రతాపాలు ప్రదర్శించాలనే ఉబలాటం.

"నా శౌర్య ప్రతాపాలు, ధైర్య సాహసాలు ప్రదర్శించే అవకాశం త్వరలోనే వచ్చింది. నగరంలో ప్రతి సంవత్సరం నగర దేవత ఉత్సవాలు ఘనంగా జరిగేవి. దేశం నలుమూలల నుంచి ఎందరో వచ్చేవాళ్లు. ఉత్సవం రోజుల్లో నగరమంతా విశాల జన సముద్రంలాగా వుండేది. వేదపాఠాలు, పురాణపఠనాలు, భజనలు, కీర్తనలు, నృత్యగాన వినోదాలు, వివిధ వస్తు ప్రదర్శనలు, ఆటల పోటీలు, ఒకటే విటి? ఎన్నో సంబరాలు. సైనికులను ప్రోత్సహించటానికి ఆ సంవత్సరం సేనాపతి పరుగెత్తే జవనాశ్వం మీద పట్టు సాధించే ప్రదర్శన పెట్టారు. వేగంగా పరుగెత్తే జాతి గుర్రాన్ని ఎక్కడో అందుకొని, ఎగిరి కూర్చుండి, కళ్లెం చేజిక్కించుకొని విశాలమైన మైదానంలో ఐదు చుట్లు త్రిప్పి అమాంతం క్రిందికి దూకాలె. ఒకటి తర్వాత ఒకటి నాలుగు గుర్రాలు మైదానంలో విడువ బడినాయి. సైనికులు తమ శౌర్య సాహసాలు ప్రదర్శించారు. ఐదవ గుర్రం అతిభయంకరమైంది. దాన్ని సమీపించటానికే ఎవరూ సాహసించలేకపోయారు. సైనికుల కోసం ఏర్పాటు చేసిన ఆ సాహస పరీక్షలో యువరాజునైన నేను పాల్గొన గూడదు. అయినా, ఎవరూ సాహసించలేక పోయారు కనుక నేనే దాని మీద ఎగిరి కూర్చున్నాను. చేతికి కళ్లెం చిక్కింది. ఐదు చుట్లు త్రిప్పి అమ్మానాన్నల ముందు దూకుదా మనుకుంటుండగానే అది నన్ను కసికొద్దీ విసరివేసి పారిపోయింది. హాహాకారం, ఆక్రందనలు నా చెవిని పడ్డాయి. స్పృహ తప్పింది. తర్వాత ఏమి జరిగిందో నాకు తెలియదు."

యయాతికి ఎనిమిది రోజుల తర్వాత స్పృహ వచ్చింది. ఆ రాత్రి స్పృహ వస్తేనే యువరాజుకు ప్రమాదం తప్పినట్లని రాజవైద్యుడు చెప్పాడు. మహారాణి ఆ యెనిమిది రోజులు అన్నపానీయాల మాటెత్తక దేవతా

గృహంలో పడివున్నది. కళిక ఆమెసేవలోనే వున్నది. స్పృహలోకి రాగానే యువరాజు తాను తన శయ్య మీదనే వున్నట్లు తెలుసుకున్నాడు. రాజవైద్యుని ఆ దేశం ప్రకారం ఏ సమయంలో ఏ ఔషధం ఇయ్యాలో యిస్తూ అలక అతని దాపుననే వున్నది. అలక తనకు పాలిచ్చిన తల్లి కూతురు. తన బాల్యసఖి. అప్పు డామె అప్సరసలా కనిపించింది. ఆమె జడలోని పూలను ఆఘ్రాణిస్తూ తమకాన ఆమె అధరాన్ని చుంబించాడు యువరాజు. అలక భయ భీతురాలయింది. "ఇదేమిటి యువరాజా!" అని మాత్రం అనగలిగింది. ఆ ప్రథమ చుంబనం మధురిమను యయాతి చివరి వరకు మరిచి పోలేక పోయాడు. ఇదంతా చాలా రమణీయంగా వర్ణిస్తాడు ఖాండేకర్.

యువ రాజుకు స్పృహ వచ్చిందన్న వార్త క్షణాల మీద రాజప్రాసాదంలో, నగరమంతటా వ్యాపించింది. రాజ దంపతుల ఆనందం సరేసరి. రాజవైద్యుడు తన చికిత్స ఫలించినందుకు ఆనంద పరవశు డయ్యాడు. యువరాజు కాలి యెముకలు విరిగాయి. వాటిని అతికించి సరిచేయటానికిగాను ఎక్కడి నుంచో శల్య చికిత్సకుణ్ణి పిలిపించారు. అత డెన్నో దేశాలు తిరిగిన వాడు. చికిత్స చేస్తూ చేస్తూ నొప్పి మరిచి పోయేందుకు గాను తాను చూచిన పలు ప్రాంతాల సుందర దృశ్యాలను వర్ణిస్తూ చెప్పేవాడు. అవన్నీ చూడాలనే కుతూహలం యువరాజుకు కలిగేది. ఏ డెనిమిది నెలల తర్వాత యువరాజు సంపూర్ణ ఆరోగ్యవంతు డయ్యాడు. ఆ సంతోషంలో పెద్ద ఉత్సవం జరగటం సహజమే. ఆ ఉత్సవంలో మహాజనుల సమక్షాన మహారాణి వద్దు వద్దంటున్నా మహారాజు హర్షాతిరేకాన అశ్వమేధయాగ సంకల్పాన్ని ప్రకటించాడు. యయాతి యాగాశ్వాన్ని పట్టుకొని దిగ్విజయ యాత్రకు బయలు దేరాడు.

ఈ దిగ్విజయ యాత్రలో జరిగిన ఘర్షణలు కొన్నే. ఇంద్రపదవిని అధిష్టించిన నహుష మహారాజు కొడుకు, స్వతహాగా పరాక్రమవంతుడు యయాతి. అతని యాగాశ్వాన్ని అవరోధించే సాహసం ఎందుకు చేస్తారు? చేసిన వాళ్లు దాసోహ మన్నారు. ఈ యాత్రలో యయాతి చూచిన సుందర ప్రదేశాలను అందంగా వర్ణిస్తాడు ఖాండేకర్. అదొక దీర్ఘ వర్ణన. అందులో విశేష మొక్కటే. ఆర్యావర్తం పూర్వ భాగాన, మంత్రతంత్రాలకు ప్రసిద్ధమైన ప్రాంతాన, దట్టమైన అడవిలోని ఒక గుహలో సాధన చేస్తున్న యతిని దర్శించుకుంటాడు యయాతి. పరస్పరం పరిచయాలైన తర్వాత బాల్యంలోనే అంగీరస మహర్షి ఆశ్రమంలోంచి పారి వచ్చిన కారణం చెప్తాడు యతి. పర్ణకుటిలో అతని కారాత్రి నిద్రపట్టలేదు. పచార్లు చేస్తుండగా పరిసరాల గల పర్ణకుటీరాల్లోని ముని కుమారుల మాటలు వినిపిస్తాయి. "అగస్త్య మహర్షి శాపం వున్న దీ రాజవంశానికి. 'నహుషుని సంతానం సుఖించదు' అని శపించాడా మహర్షి. అనుకుంటుంటా రా ముని కుమారులు. ఎన్నటికీ సుఖలబ్ధిలేని రాజభోగాల కంటే శాశ్వత సుఖాన్నిచ్చే ఆధ్యాత్మిక మార్గాన్ని అవలంబించాలని అన్ని బంధాలు త్రెంచుకొని అడవుల పాలయ్యాడు యతి. అప్పటికే కొన్ని సిద్ధులు పొందాడు. తమ్ముణ్ణి సాగనంపుతూ, "యయాతీ! నువ్వు మహారాజువు కాగలవు. నూరు అశ్వమేధాలు చేయగలవు. కాని ప్రపంచాన్ని జయించినంత సుకరంకాదు మనస్సును జయించటం. ఇది మరిచిపోకు." అని హిత బోధ చేస్తాడు యతి.

దిగ్విజయం చేసి యాగాశ్వం వెంట తిరిగి వచ్చిన యయాతికి హస్తినాపురంలో ఘనస్వాగతం లభిస్తుంది. రాజప్రాసాదంలో అడుగుపెట్టేటప్పుడు ఎదుర్కొని ఆరతియిచ్చే దాసీల్లో అలక కనిపించదతనికి. హిమాలయసానువుల్లో, దానవ రాజ్యం పొలిమేరల్లో వున్న తన పినతల్లి యింటికి వెళ్లిందని తెలుస్తుంది. అశ్వమేధయాగం సంపన్నమైన తర్వాత నహుష మహారాజుకు అంగీరస మహర్షి ఆశ్రమం నుంచి లేఖ వస్తుంది. త్వరలోనే దేవ దానవ యుద్ధం ప్రారంభమయ్యే సూచనలు కనిపిస్తున్నందున తాను విశ్వశాంతి యజ్ఞానికి

సంకల్పించినట్లు రాస్తూ, దానవులు ఆ యజ్ఞానికి విఘ్నాలు కలిగించకుండా నివారించేందుకు దిగ్విజయం సాధించిన యయాతిని పంపించ వలసిందిగా ఆదేశిస్తాడు ఆ లేఖలో మహర్షి.

యయాతి కిది అశ్వమేధయజ్ఞం కంటే గొప్ప సన్మాన మని పించింది. తండ్రి ఆజ్ఞ గ్రహించి అంగరక్షకులు వెంటరాగా బయలు దేరాడు. ఆశ్రమం ప్రవేశిస్తుండగానే కచుని దర్శన మయింది. యయాతి సమవయస్కుడతడు స్ఫుర ద్రూపి. సాత్విక స్వభావుడు. కర్తవ్య పరాయణుడు. సంయమి. త్యాగ శీలి. ప్రేమమూర్తి. పసిబాలుని లాంటి సరళ హృదయుడు. కవి, గాయకుడు, అంగీరసుని వంశజుడు. దేవ గురువు బృహస్పతి పుత్రుడు. శాంతి యజ్ఞంలో అతడే ముఖ్య ఋత్విజుడు. తొలుత అతనితో దురుసుగా ప్రవర్తించినా యయాతి అతని వలన చాల ప్రభావితు డయ్యాడు. అనుభవించాలనే లాలసకంటే త్యాగంలోనే సుఖమున్నదని తెలుసుకున్నాడు. "దేవతలు గ్రుడ్డిగా భోగవిలాసాలను ఉపాసిస్తారు. దానవులు గ్రుడ్డిగా శక్తిని ఉపాసిస్తారు ఇరు తెగల వాళ్లకూ సుఖంలేదు. దేవ దానవ యుద్ధం వలన నిష్పన్నమయ్యే దేదీ లేదు." అని గూడా కచుడు యయాతికి చెప్పాడు.

శాంతి యజ్ఞంలోని ముఖ్య భాగం ముగిసినంతలో నహుష మహారాజు ఆరోగ్యం ఆందోళన కరంగా దిగ జారి పోయిందని వార్త వచ్చినందున యయాతి వెళ్లి పోవలసి వచ్చింది. వెళ్లేటప్పుడు అంగీరసుని ఆశీస్సులు పొందటానికి సమీపించి, "భగవాన్! అగస్త్య మహర్షి మా తండ్రిగారికీ, వారి సంతానానికి సుఖించే యోగం లేదని శపించారట. కారణం తెలుసుకోవచ్చా?" అని ప్రశ్నించాడు. అంగీరసుడు సూటిగా సమాధానం చెప్పక, "యువరాజా! ఈ ప్రపంచంలో మన మంతా శాపగ్రస్తులమే. సుఖదుఃఖాలు పడుగు పేకల్లా అల్లుకున్నదే జీవితం. అందుకే నిన్ను "సుఖీ భవ" అని దీవించలేకపోయాను. నువ్వు మహారాజువు కావలసిన వానివి. ధర్మపాలన చేయవలసిందిగా దీవిస్తాను. ధర్మార్థ కామాలనే మూడు పురుషార్థాల్లో అర్థకామాలు బలవత్తరమైనవి రూపవతి అయిన స్త్రీ వినయం వలన శోభిస్తుంది. అర్థ కామాలు ధర్మం వలన శోభిస్తాయి." అని బుద్ధులు చెప్పి పంపించాడు.

యయాతి తిరిగి వచ్చేసరికి హస్తినాపురం కళతప్పి వున్నది. శోక వాతావరణం. రాజప్రాసాదంలో నైతే అంతా చింతా గ్రస్తులే. అందరివీ విషణ్ణ వదనాలే. నహుషునిలో ప్రాణం వున్నదన్నమాటే కాని కొడుకును గుర్తు పట్టే స్థితిలో లేడు. "నాన్నా! నాన్నా" అని ఎంత పిలిచినా జవాబు లేదు. మహామంత్రి యయాతిని ప్రక్కకు పిలిచి, "యువరాజా! మీరింకా చిన్నవారు. ఇక్కడ మృత్యువు ఛాయలు వ్యాపించి వున్నాయి. అశ్వమేధం, శాంతి యజ్ఞం కారణంగా అలసిన మీ కిక్కడ విశ్రాంతి దొరకదు. మన నగరానికి రెండు కోసుల దూరాన అశోక వనమనే సుందరమైన ఉద్యానవాటికవున్నది. చాలా ప్రశాంత మైన ప్రదేశ మది. ఋషులూ మునులూ అతిథులుగా వస్తే వాళ్ల విడిది అక్కడే ఏర్పాటు చేస్తాము. మహారాణి గారి ఆదేశానుసారం మీ కక్కడ సకల సౌకర్యాలు యేర్పాటు చేశాను. అంతఃపురంలోంచి అక్కడికొక సొరంగ మున్నది. ఆ భూగర్భ మార్గం చాలా దగ్గర. రోజూ రెండు తడవలు వచ్చి మహారాజు గారిని చూచి వెళ్తూ వుండండి" అని చెప్పాడు.

అశోక వనంలో యయాతికి అమాత్యులు అన్ని సౌకర్యాలూ అమర్చారు. ముకుళిక అనే క్రొత్త దాసి అతని సేవకోసం నియుక్తురా లయింది. ఆమె మహాచతుర. తన రూప లావణ్యాలతో అతన్ని అన్ని విధాలా అలరించే కళలో ఆరితేరిన ఆ దాసి అతనికి ప్రీతి పాత్రురాలయి శరీర సుఖాన్ని కూడా అందించసాగింది. సొరంగం గుండా అంతఃపురానికి వెళ్లిన యయాతికి ఒకప్పుడు తండ్రి స్పృహలో కనిపించే వాడు. ఒకప్పుడు అపస్మారకస్థితిలో కనిపించేవాడు. స్పృహలో వున్న నహుషుడు తన భార్య వైపు లాలసదృష్టితో చూస్తూ "ఈ సౌందర్యాన్ని ఈ వైభవాలను తనివి తీరా అనుభవించకుండానే వెళ్లి పోవలసి వస్తున్నది." అనే దృశ్యం

కనిపించింది. మరొకప్పుడు తన చెంత ఎవరూ లేనప్పుడు కొడుకును చెంత కూర్చుండ బెట్టుకొని పాత్రనిండా మద్యం పోయించుకొని త్రాగుతూ తన వైభవాన్ని, పరాక్రమాన్ని గురించి చెప్పుకున్నాడు నహుషుడు. "మీ పరాక్రమాన్ని గురించి విన్నాను నాన్నగారూ! మీ కొడుకును కావటం నా అదృష్టం" అన్నాడు యయాతి. నహుషుడు పేలవంగా నవ్వి "అదే నీ దురదృష్టం కూడా!" అంటూ తాను ఇంద్రపదవి నధిష్టించటం, ఇంద్రాణిని వలచి ఆమె కోరిక ప్రకారం బ్రహ్మర్షుల వాహనం (బ్రాహ్మరథం) మీద ఆమె భవనానికి వెళ్ళటం, త్వరగా నడవండని ఋషులను కాలితో తన్నటం, అగస్త్యుడు "ఈ నహుషుడు, వీని సంతానం ఎన్నటికీ సుఖించలేరు' అని శపించటం అన్నీ చెప్పుకున్నాడు. తర్వాత స్మృతి తప్పుతూ "శాపం, యతి, మృత్యువు" అని మంద్రస్వరంతో అంటూండగా యయాతి వుండ బట్టలేక యతి జీవించే వున్న సంగతీ, అశ్వమేధయాగాశ్వాన్ని పట్టుకెళుతూ తానతన్ని కలుసుకున్న సంగతీ చెప్పాడు. నహుషుడు ఒక్క ఉదుటున లేచి కూర్చుండి, "ఈ సంగతి ఇన్నాళ్లెందుకు చెప్పలేదురా? పాపీ! నీచుడా! స్వార్థపరుడా! వాడు వస్తే నీకు సింహాసనం దక్క దనుకున్నావా?" అని ఆవేశంగా అంటూ ఆ పైన మాట్లాడ లేకపడిపోయాడు. యయాతి భయపడి తల్లిని, మంత్రులను రాజవైద్యుణ్ణి కేకలువేసి పిలిచాడు. రాజవైద్యు డిచ్చిన ఏదో లేహ్యం వలన కాసేపు నిద్రించి లేచిన నహుషుడు తనకు కాలం సమీపించిందని, తన పరాక్రమ చిహ్నా లయిన దేవలోకపు స్వర్ణముద్రికలను తెచ్చి చూపించ వలసిందిగా అమాత్యులను ఆదేశిస్తాడు. కాని ఆ ముద్రికల మీది "జయతు జయత నహుష:' అనే అక్షరాలు అందరికి కనిపిస్తాయి కాని నహుషునికి కనిపించవు. నహుషుడు మరణిస్తాడు. తన పరాక్రమంతో ఇంద్రపదవిని అధిష్ఠించిన ఒక మహారాజు జీవిత కథ ఇలా సమాప్త మవుతుంది.

నహుష మహారాజు మరణించిన తర్వాత అంగీరసుడు తన సంతాపాన్ని తెల్పుతూ ఒక లేఖ రాస్తాడు. అందులోనే శాంతి యజ్ఞం నిర్విఘ్నంగా జరిగినప్పటికీ దేవ దానవ యుద్ధం తప్పేట్టు లేదని, శుక్రాచార్యుడు గొప్ప తపస్సు చేసి శంకరుణ్ణి మెప్పించి సంజీవనీ విద్యను సంపాదించాడని, ఆ బలంతో దానవులు యుద్ధ వాతావరణం కలిగిస్తారని, కచుడు శుక్రాచార్యుణ్ణి మెప్పించి అతని శిష్యుడై ఆ విద్యను సంగ్రహించటానికి గాను ప్రాణాలకు తెగించి దానవ రాజ్యం చేరాడని, శుక్రాచార్యుని అనుగ్రహానికీ, దానవుల నిగ్రహానికీ గురి అవుతున్నట్లు తెలిసిందనీ రాశాడు. అంతకు ముందే కచుడు కూడ ఈ విషయమే తెల్పుతూ యయాతికి లేఖ పంపాడు. ఈ రెండు లేఖలు దీర్ఘమైనవే కాని ప్రత్యక్షరం చదువ దగినవి. యుద్ధాన్నే దృష్టిలో పెట్టుకొని తన వాళ్ళ శక్తిని పెంచటానికి గాను దీర్ఘతపస్సు చేసిన శుక్రాచార్యుడు మారణాయుధాలను తయారు చేస్తూ, సంపాదించి కూడ బెట్టుకుంటూవున్న దేశాధినేతల ప్రతినిధి. శాంతి యజ్ఞంచేసిన అంగీరసుడూ, అందులో పాల్గొన్న తపస్సంపన్నులూ ప్రపంచశాంతికోసం శిఖరాగ్ర చర్చలు జరిపే దేశాధినేతలకు ప్రతినిధులు. పైకి చూస్తే అందరూ ప్రపంచ శాంతి గురించే మాట్లాడుతారు గాని ఎవరూ మరణాయుధాల నిర్మాణాన్ని గాని సేకరణగాని మానుకున్నట్లులేదు. అంతరంగంలో ప్రపంచ శాంతిని ఆకాంక్షించే అంగీరసుని వంటివాళ్లు బహు కొద్దిమంది.

భర్త మరణించిన తర్వాత కొన్ని రోజులు మాత్రం శోక దేవతలా వుండి,. తర్వాత ఒక్కసారిగా రాజ్యతంత్రాలన్నీ తన గుప్పిట్లోకి తీసుకున్న తన తల్లి ప్రవర్తన, భర్తను గురించి ఆమె చేసిన కొన్ని వ్యాఖ్యలు యయాతిని ఆశ్చర్య పడేట్లు చేస్తాయి. అక్కడ మనోవైజ్ఞానిక విశ్లేషణ చక్కగా చేస్తాడు ఖాండేకర్. "ఇంత కాలం

ఎంత అద్భుతంగా అభినయించింది అమ్మ!" అని విస్తుపోతాడు యయాతి. యతి వృత్తాంతం మెల్లగా తల్లి చెవిని వేస్తాడు. ఆమె ఆనందానికి అవధు లుండవు పట్టాభిషేక ముహూర్తాన్ని ముందుకు జరిపించి ఎక్కడున్నా, ఎలాగైనా యతిని వెదికి పట్టుక రావలసిందిగా యయాతిని పంపిస్తుంది రాజమాత. వెంట ఆమె ప్రత్యేక గూఢచారి అయినటువంటి మందారుణ్ణి పంపిస్తుంది. అంతకు ముందే అలకను దూరదేశం పంపించి ఆమెకు పెళ్లి చేయిస్తుంది. కళికను గూడా ఆమె దగ్గరికే పంపిస్తుంది. ఆమె ఇంగితం గ్రహించక యువరాజు సుఖం కోసం అమాత్యులు నియమించిన ముకుళికను శాశ్వతంగా పంపివేస్తుంది.

రాజకవి పుత్రుడు, యయాతి బాల్యమిత్రుడు అయినటువంటి మాధవుణ్ణి అతని ఐదారేళ్ల అన్న కూతురు తారకను గురించి ఖాండేకర్ చాల దూరం కథ నడిపినాడు. కాని అదంతా మూల కథకు అంతగా సంబంధించింది కాదు. అయినా చదువ దగింది. ఈ సంక్షిప్తకథలో దాన్ని పూర్తిగా వదిలి పెట్టటమే ఉచిత మనిపించింది.

యయాతి వెళ్లేసరికే యతి ఆ ప్రదేశం వదిలి వెళ్లినట్లు చుట్టుపట్ల గల గ్రామీణుల వలన తెలుస్తుంది. ఎన్నో అద్భుత శక్తులు సాధించిన యతి స్త్రీని పురుషుడుగా మార్చే శక్తి కోసం ప్రయత్నిస్తాడు. సాధ్యం కాదు. శుక్రాచార్యుడు తన తపశ్శక్తితో సంజీవనీ విద్యను సాధించాడని విని అలాంటి మహనీయుని అనుగ్రహం పొందితే తన సంకల్పం నెరవేరుతుందని యతి దానవ రాజ్యం చేరుకున్నాడని కూడ తెలుస్తుంది. దానవ రాజ్యంలో అతన్ని వెదికి తేవటం సాధ్యం కాదని యయాతి తిరుగు ముఖం పడతాడు. మార్గ మధ్యంలో ఒక కుగ్రామం దగ్గర నదిలో దూకి ఆత్మహత్య చేసుకునే ప్రయత్నంలో వున్న అలకను యయాతి తన వెంట తెస్తాడు. అత్తగారింట్లో ఆమె అనేక యాతనల ననుభవించింది. ఆమెను ప్రేమగా పట్టుకో బోగా ఆమె దూరం జరిగి "నేనిప్పుడు పరాయి దానిని మహారాజా!" అంటుంది. నువ్వు నాకు పరాయిదానవా? నా బాల్యసఖివి. మనిద్దరం ఒక్కతల్లి పాలుత్రాగిన వాళ్ళం కనుక నా చెల్లెలివి" అంటాడు. ఆమె తలలో కొన్ని సువర్ణకేశా లుంటాయి. యయాతి వాటిని చూపినప్పుడు "ఔను. గొప్పవాళ్లకు గొప్ప లక్షణాలే వుంటాయి. నాకు కొన్ని సువర్ణ కేశా లున్నవి. నేనెంత గొప్పదాన్నో తెలుసా? హస్తినాపుర మహారాజు చెల్లెలిని" అంటుంది. నగరం చేరిన తర్వాత మందారుని మాటలు నమ్మి రాజమాత అలకకు విషమిచ్చి చంపిస్తుంది. యయాతి ఒడిలోనే ప్రాణం విడుస్తుంది అలక. ఏ పాపమెరుగని అలక అమాయకురాలు. చావా లనుకున్నప్పుడు చావలేకపోయింది. మహారాజు చెల్లెలుగా బ్రతుకా లనుకున్నప్పుడు చావి వలసి వచ్చింది. అధికారధన మదాంధులు ఎన్ని హత్యలు చేయిస్తారో! కచుడు సంజీవనీ విద్యను సాధించాడన్న శుభవార్త అప్పుడు యయాతికి అందుతుంది. కాని దాని వలన కలుగ వలసినంత ఆనందం కలుగదు. తన చెల్లెలు తన కళ్ల యెదుటే నిర్దాక్షిణ్యంగా హత్య చేయబడింది. అట్టి స్థితిలో ఏదీ శుభవార్త కాదు.

**దే వ యా ని :**

"బయట వసంత పవనం చల్లగా పరిమళాలు వెదజల్లుతూ వీస్తున్నది. నేను నా గదిలో శయ్యపై భయంతో చెమటలు పట్టి కూర్చున్నాను. విశాల శుభ్ర కమలం లాగా శుద్ధ చతుర్దశి వెన్నెల వ్యాపించి వున్నది. బయట కోకిల కల కూజితాలు. నా హృదయంలో భగ్నవీణ స్వరాలు. వాడిపోయిన పారిజాత పుష్పంలా వున్నాను నేను.

"మనసులో వున్న భావాలే కలలుగా వస్తాయంటారు. నిజమేనేమో! ఎంత భయంకరమైన కల అది! మెలకువ రాగానే ఝుంఝామారుతంలో లతలాగా వణికి పోయాను.

"కచుని పైన నాకు కోపం వుండవచ్చు. వచ్చునేమిటి? ఉన్నది చాలాచాలా కోపమున్నది నా ప్రేమను తిరస్కరించి వెళ్ళిపోతూ వుంటే 'నువ్వు సాధించిన విద్య నీకు ఉపయోగపడదు.' అని కోపంతో శపించి వుండవచ్చు అంత మాత్రాన ఈ కలలో చూచినట్లు .

"రాక్షస గురువు శుక్రాచార్యుని పుత్రిక నైనందుకు నాలోనూ రాక్షస ప్రవృత్తి ప్రవేశించిందా? కచుడు వెళ్ళిపోయిన తర్వాత ఎంతకాలం ఏడ్చానో! ఎన్నాళ్లు అన్నపానీయాలు మానివేశానో! "నాన్నా! సంజీవనీ విద్య పోతే పోయింది. మళ్లీ ఘోర తపస్సు చేసి ఆ కపటి, కఠోర హృదయుడు, కృతఘ్నుడు అయిన కచుణ్ణి నా ముందర తెచ్చి పడవేయి" అని నాన్నను కోరాను. కచుడు జీవితాంతం మరిచిపోని విధంగా శిక్షించాలనే కోరిక వుండేది. ఇప్పటికీ వున్నది. నా ప్రేమను తిరస్కరించి, నా హృదయాన్ని నిర్దయగా కాళ్ళ క్రింద రాచి, 'నిన్ను ఋషిపుత్రు డెవడూ పెళ్లి చేసుకోడు' అని శపించి వెళ్లాడే! అతణ్ణి శిక్షించాల్సిందే. కాని ఈ కలలో శిక్షించినట్లా? అది జ్ఞప్తికి వస్తే ఇంకా నా వొళ్లు జలదరిస్తున్నది. ఆ కల - ఇంకా నాకళ్ళముందున్నది. వృషపర్వ మహారాజు సభలో కచుణ్ణి గొలుసులతో కట్టి తెచ్చారు. "గురుపుత్రీ! మా గురుదేవులు మళ్లీ తపస్సు చేయటానికి వెళ్తూ 'రాజా! నా బిడ్డ దేవయాని నా ఆరవప్రాణం. ఈమె కెలాంటి మనఃక్షోభ కలుగ గూడదు. ఎప్పుడూ సుఖంగా వుండేటట్లు చూడు.' అని ఆజ్ఞాపించాడు. కచుని కారణంగా నీ కెంతటి దుఃఖం కలిగిందో తెలుసు. ఇతన్నెలా శిక్షించాలో చెప్పు" అని ప్రశ్నించాడు మహారాజు. నిజమైన ప్రేమలో శిక్ష లుంటాయా? 'నన్ను గట్టిగా నీ బాహుపాశంలో బంధించు'మని కచుణ్ణి కోరవచ్చు. నేనలా కోరలేదు. 'నా పెదవుల నొకసారి చుంబించు. ఒకే ఒకసారి. నీకే శిక్షపడదు.' అని మాత్రం కోరాను. దానికీ అతడు అంగీకరించలేదు. నే నతని సోదరినట. ఎంతటి వెర్రి! ఎంతటి దురభిమానం! ఎంతటి హఠం! మూడు సార్లు చచ్చిన వాణ్ణి నా తండ్రిని వేడుకొని బ్రతికించానే! సంజీవనీ విద్యను సైతం అతని కిచ్చి అతణ్ణి బ్రతికించ వలసిందిగా వేడుకున్నానే! అన్నీ మరిచిపోయి నన్ను అవమానించిన అతనికి కఠోరాతి కఠోరమైన శిక్ష ఇప్పించ వలసిందే. 'గురుపుత్రీ! ఏ శిక్ష విధించాలె?" అని ప్రశ్నించాడు మళ్ళీ వృషపర్వ మహారాజు. "మహారాజా! ఈ కచుని శిరశ్ఛేదం చేసి ఇతని శిరస్సును పళ్లెంలో పెట్టి నా చేతికి ఇప్పించండి. నృత్యంలో దేవయాని ఎంతటి నిపుణురాలో నేడు సభాసదులు తిలకిస్తారు" అన్నాను నా మాట వెంటనే పాటించబడింది. ఆ పళ్లెరాన్ని చేతిలో పట్టుకొని రకరకాల నృత్య విన్యాసాలు చేశాను. చివరికి పళ్లెరాన్ని క్రింద పెట్టి కచుని ఖండిత శిరస్సును రెండు చేతులతో పట్టుకొని అతని పెదవులను చుంబిస్తూ 'కచదేవా! ఎంత వేడినా నా పెదవులనుచుంబించ వైతివి. నేనా పని చేస్తున్నాను చూడు' అన్నాను. అంతలో మెలకువవచ్చింది. చిన్నప్పుడు విన్న రాక్షసుల కథలే ఇలా కలగా రూపొందాయా? ఛ!

"కచుని పట్ల నా కింకా చెప్పరానంత ప్రేమే. అతన్ని గురించి ఇంతటి క్రూరమైన కల యెలా వచ్చింది నాకు? అత డంటే నాకెంత ప్రేమో అతనికీ నా పట్ల అంతప్రేమలేక పోలేదు. నన్ను సంతోషపెట్టాలని ఎంతగా ప్రయత్నించేవాడు! నా కిష్టమైన పూలను ఎన్ని కష్టాలు పడి తెచ్చేవాడు! విద్యార్జన చేసేవాడు వ్రతస్థుడై వుండాలనే వాడు. నాకు దూర దూరంగా వుండేవాడు. తాకేవాడు కాదు. పొరపాటున నా చేయి తాకితే క్షణకాలం ఎలా పులకించి పోయే వాడో చాలసార్లు గమనించాను. నాలాంటి అందగత్తె దేవలోకంలోనూ లేదనేవాడు. అతని మీద నాకు ఒక వైపు ప్రేమ. ఒక వైపు కోపం. ఇక్కడి నుంచి వెళ్లిన తర్వాత ఒక శబ్దమైనా నన్ను గురించి రాశాడా? లేదు. సంజీవనీ విద్య సంపాదించి దేవతలకు మేలు చేశాడని దేవలోకంలో అతని కెన్ని ఘన సన్మానాలు జరుగుతున్నాయో? సంజీవని విద్య నా కారణంగానే గదా అతనికి దొరికింది? అక్కడి అప్సరసల అందాలను చూస్తూ ఈ దేవయాని నెందుకు స్మరిస్తాడు? పురుషులు పాషాణ హృదయులు. పూవు వికసించిన స్వల్ప

కాలంలోనే దాని రేకులు రాలి పోతాయి. మిగిలేవి ముళ్లే. ప్రేమంటే ఇదేనా? నేను శుక్రాచార్యుని పుత్రికను. ఇతర స్త్రీల లాగా విలపించే దాన్ని కాను. కచుణ్ణి అతని ప్రేమ పరిమళాన్నీ మరిచి పోతాను. 'నిన్ను ఋషి కుమారుడెవడూ పెళ్ళి చేసుకోడు' అని శపించి వెళ్లాడు గదా! ఋషి కుమారుణ్ణి పెళ్లాడి పర్ణకుటీరాల్లో వల్కలాలు ధరించి పడి వుండాలన్న కోరిక ఎవరి కున్నది గనుక!"

దేవయాని నిజంగా అందమయింది. రాకుమారి శర్మిష్ఠకంటె అందమయింది. అవకాశం దొరికి నప్పుడల్లా దేవయాని తన అందంతో శర్మిష్ఠను అవమానపరిచేది. శర్మిష్ఠ తన అధికార దర్పంతో అవమాన పరిచేది. దేవయాని కోసం కచుడు దేవలోకం నుంచి ఒక అపురూపమైన పటాంశుకం తెచ్చి బహూకరించాడు. వసంతోత్సవంలో దేవయాని దాన్నే ధరించి వెళ్లింది. శర్మిష్ఠకు అసూయ కలగటం సహజం. జలక్రీడ లాడే కన్నియలంతా తమ తమ దుస్తులను ఒడ్డున పెట్టి సరస్సులో దిగారు. శర్మిష్ఠ అందరికంటె ముందు ఒడ్డు చేరి దేవయాని పటాంశుకాన్ని ధరించింది. తన అంశుకం తన కిమ్మని దేవయాని అడిగితే శర్మిష్ఠ ఇయ్యనన్నది. అది తనదే అన్నది. ఒక దేవతా స్త్రీ తన తల్లికి రాత్రి తెచ్చియిచ్చిందని బుకాయించింది. వాగ్వాదం పెరిగింది. "నేనెవరో తెలుసా?" అని బింకంగా ప్రశ్నించింది దేవయాని. "తెలియ కేమి? మాతండ్రి ఆశ్రయంలో వున్న ఒక భిక్షుకుని కుమార్తెవు. మా తండ్రి అమాయకుడు గనుక మీ తండ్రిని "గురుదేవా?" అని సంబోధిస్తాడు. సభలో మా తండ్రి సింహాసనం మీద మీ తండ్రి మృగాజినం మీద కూర్చుంటారు. ఆ అంతరం గుర్తించి మాట్లాడు" అన్నది శర్మిష్ఠ. కోపం పట్టలేక దేవయాని పరుగెత్తింది. శర్మిష్ఠా, ఆమె చెలికత్తెలూ వెంట పరుగెత్తారు. తీగలతో కప్పబడిన ఒక పాడుబడిన నూతిలో పడిపోయింది దేవయాని. శర్మిష్ఠ ప్రవర్తన, దేవయాని ప్రవర్తన వాళ్ల పెరిగిన పరిస్థితులకు, వాళ్ల మనస్తత్వాలకు తగినవే. అనుభవ శూన్యమైన అహంకారం. వేట కోసం వచ్చి దప్పిక అయినందున పాడుబడిన నూతిని సమీపించిన యయాతి అందులో పడి యేడుస్తున్న దేవయానిని తన కుడిచేత పట్టి పైకెత్తుతాడు. ఆమె అందానికి ముగ్ధ డవుతాడు త్రిలోక వంద్యుడైన శుక్రాచార్యుని కుమార్తె అని గ్రహిస్తాడు. పాణిగ్రహణం చేసినందు వలన తనను భార్యగా స్వీకరించ వలసిందిగా దేవయాని అర్థిస్తుంది. బ్రాహ్మణ కన్యను పెళ్లాడటానికి సంకోచించినా ఆమె సౌందర్యానికి వశుడైనందున, శుక్రాచార్యుని శాపానికి భయపడినందున అంగీకరిస్తాడు యయాతి. అంతలో ఆమెను వెదుకుతూ రథం మీద వృషపర్వుడూ, శుక్రాచార్యుడూ వస్తారు. శర్మిష్ఠ చేసిన అవమానాన్ని తెల్పి నగరంలోనికి రావటానికి నిరాకరిస్తుంది దేవయాని. శుక్రాచార్యుడూ రానంటాడు. దానవ కులానికి శుక్రాచార్యుడే దిక్కు. అతడు వెళ్లి పోతే దానవ కులం నశిస్తుంది. కులాన్ని రక్షించుకోడానికి తన కూతురును బలియిస్తాడు వృషపర్వుడు. దేవయాని కోరిక ప్రకారం రాకుమారి శర్మిష్ఠను ఆమె దాసిగా హస్తినాపురానికి పంపించవలసిన వాడవుతాడు.

**శర్మిష్ఠ :**

శర్మిష్ఠ చెప్పుకున్న ఆత్మకథ చాలా వరకు దేవయాని చెప్పుకున్నదే. ఆమె కూడా కచుణ్ణి ప్రేమిస్తుంది. కాని ఆ ప్రేమ వేరు. అందులో ఆరాధన తప్ప అనుభవించాలన్న ఆకాంక్ష అణుమాత్రం లేదు. ఏ రాజూ తన కుమార్తెను దాసిగా పంపటానికి అంగీకరించడు. వృషపర్వుడు తన కులాన్ని రక్షించుకోడానికి అంతటి త్యాగం చేయవలసిన వాడవుతాడు. ఆ మాట తన నోటి మీదుగా చెప్పలేక లేఖ ద్వారా తన పరిస్థితిని వివరిస్తాడు. ఇంత వరకు గర్విష్ఠిగా కనిపించిన శర్మిష్ఠ తండ్రి ఆజ్ఞను శిరసావహిస్తుంది. ఆమె సంస్కారవతి. దేవయాని కచుణ్ణి ప్రేమించింది. తన స్వభావానికి తగినట్లు మొండిగా ప్రేమించింది. తల్లీ, తండ్రి తానే అయి ఆమెను అతిగారాబంగా పెంచిన శుక్రాచార్యుడే ఆమె అంత మొండిగా మారటానికి కారకుడు. ఆమె కావాలన్న దాన్ని

అతడు తత్క్షణం లభింపజేయగల సమర్థుడు. కచుని విషయంలో ఓడి పోయాడు. ప్రేమ విఫలమైనందుకు ఆమె యెంత బాధ పడ్డదో ఆమె తండ్రీ అంత బాధ పడ్డాడు. దేవయాని కచుణ్ణి మొండిగా ప్రేమించింది కాని అతనిలోని సంస్కారాన్ని, ఔన్నత్యాన్ని, అమృతత్వాన్ని గ్రహించలేకపోయింది. శర్మిష్ఠ గ్రహించగలిగింది. కచుడు దేవలోకానికి వెళ్లిపోయేటప్పుడు శర్మిష్ఠను కలుసుకుంటాడు. రాక్షసు లతణ్ణి మూడు సార్లు చంపినా బ్రతికి బయట పడ్డాడు గనుక శర్మిష్ఠ విచారాన్ని ప్రకటిస్తే, "కొన్ని కొన్ని విషయాలు భయంకరంగా తోస్తాయి. కాని నిజంగా భయంకరమైనవి కావు. అనుభవంతో చెప్తున్నానమ్మా యీ మాట. మృత్యువూ అలాంటిదే" అంటాడు కచుడు. "పెళ్లి చేసుకొని దేవలోకానికి వెళ్తుంటే ఎంతో ఆనందంగా వీడ్కోలిచ్చేదాన్ని" అంటే, "రాజపుత్రీ! జీవితం ఎప్పుడూ అపూర్ణమే. అయినా అందులోనే మాధుర్యాన్ని పొందాలె" అంటాడు కచుడు. "ప్రేమ విఫల మయ్యేకంటే ప్రేమ కలుగకుండా వుంటేనే మేలు కదా" అంటే, "అలా కాదమ్మా! దేవి మీదయినా ప్రేమ కలుగాల్సిందే. హృదయాంతరాల్లో నెలకొన్న ప్రేమ, కపటమూ, స్వార్థమూ, కామమూ లేని ప్రేమ. దేవయాని నీ బాల్య సఖి కదా. ఎప్పుడైనా ప్రసంగం వస్తే కచుని హృదయంలో దేవయాని ప్రేమ ఎప్పుడూ వుంటుందని చెప్పు!" అంటాడు. కచుని వలన శర్మిష్ఠ చాలా సంస్కారవంతురాలవుతుంది. ఆ మాట తర్వాత యయాతికి చెప్తుంది కూడా.

హస్తినాపురంలో దేవయాని అందరికీ శర్మిష్ఠను తన దాసిగా పరిచయం చేస్తూ ఆమెను అవమానించే యే అవకాశాన్నీ వదిలిపెట్టదు. రాజమాత మాత్రం శర్మిష్ఠను దాసిగా కాక రాజకన్యను చూచినట్లు ఆదరంగా చూస్తుంది. అత్తా కోడళ్ళకు ఎప్పుడూ సయోధ్య కుదురదు. "మా తండ్రి గొప్ప తపశ్శాలి" అని ప్రారంభిస్తుంది దేవయాని. "మీ మామ గొప్ప పరాక్రమ వంతుడు" అని మొదలు పెడుతుంది రాజమాత. వాళ్ల సంభాషణ రాజుల నింద, ఋషుల నిందతో సాగి సాగి ఏదో విధంగా దేవయాని శర్మిష్ఠను అవమానించటంతో ముగుస్తుంది. శర్మిష్ఠ మాత్రం తన దురదృష్టానికి లోలోన క్రుంగిపోతుంది కాని పైకి మాత్రం తన విచారాన్ని వెల్లడి కానీయదు. మహారాజు కూడా ఆమెను దాసిగా కాక రాజకన్యగానే సంభావిస్తాడు.

దేవయానీ యయాతుల వివాహం మహావైభవంగా జరిగింది. తనకు పట్టిన అదృష్టానికి శర్మిష్ఠ కుమిలి కుమిలి యేడుస్తుందని ఆశించిన దేవయానికి నిరాశే ఎదురవుతుంది. దాసిగా శర్మిష్ఠ తన విధులు మహోత్సాహంగా నిర్వర్తిస్తుంది. శోభనం నాటి రాత్రి దేవయాని దాసీ లందరిని పంపివేసి శయ్యాగృహానికి కాస్త దూరంగా శర్మిష్ఠ నొక్కతెనే నిలిపి, "మహారాజుకు నీచేతి తాంబూలాలు ఇష్టం గదా. పళ్ళెంలో ఇరవై విడియాలు పేర్చుకొని అక్కడే నిల్చుండు. నేను పిలువందే గది సమీపానికి రావద్దు. లోపల యేమి జరుగుతుందో అని తొంగి చూచి నవ దంపతుల మాటలను నలుగురికి చెప్పటం దాసీల స్వభావం" అని హెచ్చరిస్తుంది. ఆమె శర్మిష్ఠను జన్మతః దాసిగా నిరూపించాలనే దుర్బుద్ధితో చేసిన హెచ్చరికే యిది. అయినా, శర్మిష్ఠ ఏమాత్రం చలించక ఆమె నిల్పిన చోట నిల్చి వుంటుంది. మహారాజు శయన మందిరంలో ప్రవేశిస్తూ పళ్లెరంలోని తాంబూలాన్ని పట్టుకొని వెళ్తాడు. ఆమె వైపు చూడడు. ఎవరో దాసి అనుకుంటాడు. అతడు శయన గృహంలో ప్రవేశించిన కొన్ని క్షణాల్లోనే భార్యా భర్తలిద్దరు ఘర్షణ పడుతున్నట్లు అస్పష్టంగా వినిపిస్తుంది. టభాల్న తలుపు తీసుకొని దేవయాని కోపంతో బుసలు కొడుతూ విసురుగా వెళ్ళి పోతుంది. పోతూ పోతూ శర్మిష్ఠ చేతిలోని తాంబూలాల పళ్లెరాన్ని క్రింద పడవేసి వెళ్తుంది. ఏమి జరిగిందో అర్థం కాక నిశ్చేష్టురాలై నిల్చుండి పోతుంది

(సశేషం)

# కలాన్ని కత్తి చేసిన...

## జనం మరచిన జర్నలిస్టు డేనియల్ డిఫో (1660 - 1731)

**- దేవరపల్లి రాజేంద్ర కుమార్**

అతని జీవితం నవ రసాలు పరిపూర్ణంగా పండిన అద్భుత నాటకం. హాలీవుడ్ సినిమాకు సరిపోయే కథాంశం. బాక్సాఫీసు విజయానికి కావలిసిన 'మసాలా' అందులో ఉంది. షేక్స్పియరన్ నటుడు లారెన్స్ ఆలీవర్ చిత్రాల్లోలా సుదీర్ఘ సమాస భరిత సంభాషణలు, స్టీవెన్ సీవిల్ బెర్గ్ సినిమా హీరోలా ధీరోదాత్తత, ఇటీవల ఆస్కార్ అవార్డు పొందిన 'ఫారెస్ట్ గంప్' చిత్ర కథానాయకుడిలా అశక్తత, ఆశావాదం, అకిరా మెరసోవా చలన చిత్ర కావ్యాల్లా కావలిసినంత కాన్వాసు అతని జీవిత మంతా పరచుకొని ఉంది. పుట్టుక, పెరుగుదల, చదువు, పెళ్ళి, వ్యాపారం, వ్యాసంగం, వృత్తి, మతం, రాజకీయాలు, ప్రవాసం, సభాగౌరవం, అభినందనాలు అవమానాలు, చెరసాలలు, గండకొయ్యలు, చివరకు మరణంలో కూడ అతను వివాదాలు, సందేహాలు, ప్రశ్నలు, పరిశోధనల్లో భాగ మయ్యాడు. అతనే డానియల్ డిఫో - ఆధునిక పత్రికా రచనకు, నవలకు పితామహుడు. ప్రపంచంలోనే మొదటి సారిగా పత్రికల్లో రాజశాసనాలు, ప్రకటనలతో పాటు వార్తలు కూడా ఉండాలని భావించి ప్రచురించిన ప్రప్రథమ జర్నలిస్టు. సంపాదకీయం అనే ఒరవడిని అతను ప్రవేశ పెడితే ఈ రోజు సంపాదకీయం లేని పత్రిక మనకు కనిపించదు. పత్రికలో ఒక ప్రధాన వ్యాసం ఉండాలని మొదలు పెట్టిన వాడు, జర్నలిస్టుకు వివిధ భాషా పరిచయం, సాంఘిక, విజ్ఞాన శాస్త్రాల అవగాహన ఉండాలని బోధించినవాడు డిఫో. డెయిలీ సీరియల్‌ను తొలిసారిగా రాసిన వాడు, భూతప్రేతాలు పాత్రలుగా రచనలు చేసినవాడు కూడా మన కథానాయకుడే. ఎవరో చెప్పారని కాకుండ, చూసింది చూసినట్టు 'మెదడు' ఉపయోగించి రాయగలగాలి అనే ప్రాథమిక అంశాలను పరిశీలించిన వాడు, జర్నలిస్టు - కవి, రచయితా అయితే ఎటువంటి రచనలు అతని కలం నుంచి వెలువడుతాయో రాసి చూపించిన వాడూ, భాషా భేషజం, పదడాంబికం లేకుండా సాదాగా, అతి సాదాగా, సాధారణ పాఠకుడిని దృష్టిలో పెట్టుకుని ఏ విధంగా రాయాలో ఆచరించి చూపిన వాడూ అయిన డానియల్ డిఫో లండన్‌లో 1660-61 ప్రాంతాల్లో జన్మించాడు. ఈ సంగతి అతనే స్వయంగా రాసిన ప్రొటెస్టంట్ మొనాస్టరీ అనే గ్రంథం ముందు మాటలో తన 67వ ఏట పేర్కొన్నాడు. సంప్రదాయబద్ధంగా విద్యాభ్యాసం చేయలేదు. రోమన్ కాథలిక్కు చర్చి ఆధిపత్యాన్ని తిరస్కరించి, ప్రశ్నించే కుటుంబ వాతావరణం. సహజంగానే అలాంటి భావాలు వృద్ధి చేసే వేరొక పాఠశాలలో, అకాడమీలో చదువుకున్నాడు. అక్కడ ఇంగ్లీషు, లాటిన్, శ్పానిష్, ఇటాలియన్, గ్రీకు, ఫ్రెంచి, గణితం, జాగ్రఫీ, ఆధునిక చరిత్ర, అనేక దేశాల వ్యాపార, వాణిజ్య స్థితి గతులను అధ్యయనం చేశాడు. మతబోధకుడుగా మారాలనుకుని పరువు తక్కువ అని భావించి వ్యాపారంలో దిగి మోచేతులదాకా కాల్చుకున్నాడు.

దైవాంశ సంభూతుడుగా జనం భావించక తప్పని రాజు జేమ్సుకు వ్యతిరేకంగా జరిగిన మన్‌మొతే విప్లవంలో పాల్గొన్నాడు. విప్లవం విఫల మయింది. సహవిద్యార్థులు ఉరికంబ మెక్కారు. డిఫో మాత్రం తప్పించుకున్నాడు. వ్యాపారంలో చేసిన అప్పులకు, తప్పులకు పరిహారంగా జైలు పాలయాడు. పెద్ద మనుష్యుల హామీ మీద బయటకు వచ్చి మళ్ళీ వ్యాపారం చేసి పూర్తిగా మునిగిపోయాడు. ప్రవాసంలో ఉండగా మొదటి వ్యంగ్య రచన కింగ్ జేమ్స్‌కు వ్యతిరేకంగా ఎక్కు పెట్టి సంధించాడు. విలియం రెండో సారి జరిపిన తిరుగుబాటులో విజయం సాధించాక అతడు జీవితాంతం డిఫోతో చాలా సన్నిహితంగా ఉండేవాడు.

1704లో 'ది రివ్యూ' పత్రిక ప్రారంభించాడు. గ్రంధకర్త, విమర్శకుడు అయిన సర్ హెరాల్డ్ నికల్సన్ ఆధునిక జర్నలిజానికి డిఫో పితామహుడు, ప్రతిప్రెస్ క్లబ్‌లోనూ అతని స్మారక చిహ్నాలుంచి, డిఫోను గౌరవించా లంటే, మరొక విమర్శకుడు డిఫో వంటి అతిపాపిష్టి నీచ, దుష్ట జర్నలిస్టు మరొకడు లేడని తిట్టిపోశాడు. పద్దెనిమిదో శతాబ్దం ప్రధమార్థం నాటి రాజకీయ వాతావరణం ఎందరో జర్నలిస్టులుగా మారే అవకాశం కల్పించింది. ఆ నాటి పత్రికల్లో అన్నీ రాజకీయ వార్తలే. అయితే వాటిలోని వ్యంగ్యం ఎత్తి పొడుపు లేనిది. పదేళ్ళ పాటు నడిచిన 'ది రివ్యూ' కు సంపాదకుడు, విలేకరి, ముద్రాపకుడు - అన్నీ డిఫోనే. ఒక్క చేతి మీదుగా మొత్తం నిర్వహించే వాడు. డిఫో కారాగారంలో ఉన్నప్పుడు ప్రారంభమయిన 'ది రివ్యూ' అతను ప్రవాసంలో, అనారోగ్యంలో ఎక్కడ ఉన్నా ఏనాడూ మూతపడలేదంటే డిఫో కార్య సాధనా సామర్థ్యం పాఠకులు అంచనా కట్టవచ్చు. అప్పటి ప్రధాన రాజకీయ, సాంఘిక, ఆర్థిక, సాహిత్య స్థితి గతులకు దర్పణం 'రివ్యూ.' ఎన్నికలు, యుద్ధాలు, వాణిజ్యం, పత్రికలు, ప్రజారోగ్యం, వలసలు, కార్మికులు, విదేశీ విధానం ఇలా ఎన్నో విషయాల గురించి అనర్గళంగా రాసేవాడు డిఫో. వారపత్రికగా మొదలయి కొద్దికాలంలోనే వారానికి మూడు సార్లు వెలువడ్డ నాలుగు చిన్న పేజీల 'రివ్యూ'లో అప్పటికి ఎవరూ కని విని ఎరుగని విధంగా "అడ్వయిజ్ ఫ్రం ది స్కాండల్ క్లబ్' అనే కాలమ్ ఒకటి ప్రారంభించాడు. వార్తా ప్రాముఖ్యం ఉన్న ప్రతి విషయం గురించి అందులో రాస్తూ దాన్ని 'లిటిల్ రివ్యూ' పేరుతో విడిగా అందచేసేవాడు. ఇవ్వాళ పుట్టిన రోజులు, పట్టపు రోజులు, చావులు, సమర్తలకు ఎలాగ ప్రత్యేక సంచికలు వేస్తున్నారో ఆ రోజుల్లో విలియం రాజు జన్మదిన సందర్భంగా ప్రత్యేక అనుబంధాలు ప్రచురించేవాడు. అప్పటికే వ్యాప్తి చెందుతున్న 'షార్ట్ హ్యాండు' నేర్చుకుని విన్నవీ, కన్నవీ పూసగుచ్చినట్టు రాసేవాడు. ఒకాయన వాపోయినట్టు ఆనాడు డిఫో మొదలు పెట్టిన గాసిప్ ప్రభావం ఇంకా పత్రికలను వదల్లేదనేది వాస్తవమే గదా!

'రివ్యూ' ప్రారంభమే ఫ్రాన్స్‌లో జరుగుతున్న యుద్ధం మీద వ్యాఖ్యలతో మొదలయింది." ఏ రివ్యూ ఆఫ్ ది ఎఫైర్స్ ఆఫ్ ది ఫ్రాన్స్ అండ్ ఆఫ్ ఆల్ యూరప్ యాజ్ ఇన్ ఫ్లూయెన్స్‌డ్ బై దట్ నేషన్" అనేది అసలు పూర్తి పేరు. కొన్నాళ్ళకు చివరిముక్క తీసి "విత్ అబ్జర్వేషన్స్ అండ్ ట్రాన్సాక్షన్స్ ఎట్ హోమ్' గా మార్చాడు. మరి కొన్నాళ్ళకు కేవలం 'ది రివ్యూ'గానే ఉంచాడు. 'రివ్యూ' ప్రభావంతో 'ది టాట్లర్', 'ది స్పెక్టేటర్', 'ది అబ్జర్వేటర్' , 'ది రిహార్సల్' అనే పత్రికలు మొదలయాయి. వాళ్ళూ, వీళ్ళూ అనే తేడా లేకుండా అందర్నీ రివ్యూ చాకిరేవులో ఉతికి ఆరేసే వాడు డిఫో. కాకపోతే మతాధికారులకు ఓ మోతాదు ఎక్కువ వాయనం దొరికేది తరచుగా. అందులోని వార్తలు, వ్యాసాలు, 'విషయం' దృష్ట్యా ప్రముఖ మయాయి. వార్తారచనలో భాషను సాధనంగా ఉపయోగించాడే తప్ప ప్రాసకోసం పాకులాట, సమాసాల కోసం చిరాకు పుట్టించే విధంగా డిఫో ఒక్కనాటికీ రాయలేదు. వ్యంగ్యం, శ్లేష, ఎత్తిపొడుపు, విమర్శ, నిజాయితీ, సాదాతనం, ధారాళత అన్నీ కలిపితే డిఫో రాసిన వార్తయ్యేది. ఒక చరిత్ర కారు డన్నట్టు వార్తాసేకరణలో డిఫో తన కళ్ళు, చెవులు, మెదడును తప్ప, దేన్నీ, ఎవరినీ నమ్మలేదు. డిఫో లాంటి జర్నలిస్టు 'పురుగుల' పీడ, చీడ, వదిలించుకునేందుకు ప్రభుత్వం 1712లో నూతన పన్ను విధానాన్ని ప్రవేశపెట్టి చాలా పత్రికల నడ్డి విరగగొట్టింది. అటువంటి ఆర్థికదుస్థితిలో కొద్ది రోజులు చలాయించుకొచ్చినా, ఎక్కువ కాలం నిభాయించుకోలేక, 'రివ్యూ' ను మూసేశాడు.

వెంటనే 'మార్కెటర్' అనే పేరుతో ఒక వాణిజ్య పత్రికను స్థాపించాడు. అధికారికంగా ఆ పత్రికకు డిఫో సంపాదకుడు గానీ, ఉద్యోగి గానీ కాదు. అయితే పాఠకులు 'మార్కెటర్' ను నడిపిస్తున్న దెవరో తెలుసుకోగలిగారు. జాతీయ ప్రయోజనాలకు వ్యతిరేకంగా బ్రిటిషు వాణిజ్య మండలి తీసుకునే నిర్ణయాలను ఆ పత్రికలో తీవ్రంగా దుయ్య పట్టేవాడు. 'మెర్క్యురియస్ పొలిటికస్' మాసపత్రికను, 'న్యూస్ లెటర్' ను రాత పత్రికలుగా

వెలువరించాడు. 'మిస్ట్', 'వైట్ హాల్ ఈవినింగ్ పోస్ట్'', 'డైలీపోస్ట్' 'ఆపిల్ బీస్ జర్నల్' వంటి పత్రికలు స్థాపించటమో, వార్తలు, వ్యాసాలు రాయటమో చేసేవాడు.

అవసరం గౌరవనీయుణ్ణి కూడా మోసగాడుగా, కిలాడీగా మారుస్తుందని డిఫో విషయంలో రుజువయ్యింది. మొదటి నుంచి రోమన్ కాథలిక్ చర్చి ఆధిపత్యాన్ని, పెత్తనాన్ని ప్రశ్నించే వాతావరణంలో పుట్టి పెరిగిన డిఫో ఆర్థిక, రాజకీయ కారణాల వల్ల దాని ప్రాబల్యంలో నడిచే పత్రికలకు, టోరీలకు అనుగుణంగా రాయవలసి వచ్చింది. కొన్ని సందర్భాల్లో విగ్, టోరీ పత్రికలకు వార్తలు రాశాడు. ప్రభుత్వ గూఢచారిగా, ప్రతినిధిగా పనిచేశాడు. 1718 వరకూ చురుకుగా విలేకరి జీవితం గడిపిన డిఫో రాసిన ఆఖరి వార్తాకథనం 1724 లో అచ్చయింది. ఆ తర్వాత ఎందుకు రాయటంలేదనీ ఎవరో అడిగితే, "నేను రాయాలంటే సంపాదకులు ప్రభుత్వం దగ్గరనుంచి ముందు అనుమతి తీసుకోవాలన్నారు. ఆపని నావల్లకా''దన్నాడు. 1719లో డిఫో కాల్పనిక సాహిత్యకృషిలో దిగాడు. అదే సంవత్సరం రాబిన్‌సన్ క్రూసో మూడు భాగాలు రాశాడు. పత్రికారంగం నష్టం సాహిత్య రంగానికి ప్రయోజన మయింది. ఏ నాడో తాను 'ఇంటర్వ్యూ' చేసిన అలెగ్జాండర్ సెల్‌కిర్క్ అనే సాహస నావికుని యదార్థ జీవిత సంఘటనలు ఇతివృత్తం కాగా, మన్మొతే విప్లవం విఫలమయిన దశలో తాను దాక్కున్న శ్మశానంలో ఒక సమాధి రాయి మీద చూసిన 'రాబిన్‌సన్‌క్రూసో' కథానాయకుడు. క్రూసో మూడో భాగం డిఫో ఆత్మకథ అని పలువురి అంచనా. మరికొందరేమో ఆ నవల మొదట వార్తా కథనంగా మొదలై తర్వాత ఆ రూపానికి వచ్చిందని అంచనా వేశారు. 19వ శతాబ్దాంతానికి 'క్రూసో' అనువాదాలు, అనుసరణలు దాదాపు 700 ఎడిషన్లుగా వెలువడ్డాయి. వివిధ భాషల్లో అఫెన్‌బక్ నాట్య సంస్థవారు క్రూసోను ఒపేరాగా రూపొందించారు. ఒక ఔత్సాహిక పారిశ్రామిక వేత్త పారిస్ దగ్గర రాబిన్‌సన్ పేరుతో చెట్టుమీద ఒక రెస్టారెంటును నిర్మించాడు. దానితో ఫ్రాన్సులో 'అన్ రాబిన్‌సన్' అనే పదం పెద్దగొడుగుకు సమానార్థకం, పర్యాయ పదం అయింది. క్రూసో విజయం చూసి ఓర్చుకోలేని ఓ విమర్శకుడు "ఆఁ ఏముంది? ముసలీ, ముతకా దీన్ని కొని దేవుడి పుస్తకాలతో బాటు జాగ్రత్త చేస్తున్నారు. మరిక అమ్ముడు పోతుందంటే పోదా?" అని చిరాకు పడ్డాడు. ప్రపంచ ప్రఖ్యాత తత్వవేత్త ఎ.జె. అయర్ "కెన్ దేర్ బి ఏ ప్రయివేట్ లాంగ్వేజి" అనే పెద్ద వ్యాసాన్ని తన ఒక గ్రంథంలో రాశాడు. ఆ వ్యాసంలో రాబిన్‌సన్‌ను చిన్నప్పుడే ద్వీపంలో వదిలివేసినట్లయితే అతని భాష, ఆలోచనా ఎలావుండే వన్న విషయాన్ని వివరంగా చర్చించాడు. వ్యభిచారులయిన స్త్రీలను కథానాయికలుగా చేసి నవలలు (రోక్సానా, మోల్ ఫ్లాండర్స్) రాశాడు. తాగుబోతులు, తిరుగుబోతులు తారుపుడుగాళ్ళు, జేబుదొంగలు, నేరస్తులు, అమర్యాదస్తులు, 'అలగా' జనం గురించి ఎన్నో నవలలు, కావ్యాలు రాయగలిగాడు. (ఎవరయినా రచయిత ఇక్కడ గుర్తుకు వస్తే పాఠకుల పొరపాటు కాదు). అయితే డిఫో నిజాయితీ ఎక్కడ ఉందంటే, 'లేకి' మనుష్యులగురించి రాసిన పుస్తకాలు బాగా అమ్ముడు పోతాయని శుభ్రంగా ఒప్పుకోవటంలో ఉంది.

క్రూసో నవల తర్వాత డిఫో లండన్ నగరంలోని ఒక గుహలో కొంతకాలం ఏకాంతంగా గడిపి, అక్కడి కొచ్చే నాటు పిల్లలకు డాన్సుచేయటం నేర్పించాడని కొందరు చెపుతారు. 'హెలి యోప్రోపోలిస్, సెక్రటరీ టుది ఎంపరర్ ఆఫ్ ది మూన్' , 'ఏ విట్‌నెస్', 'టి.టేలర్', 'మర్చంట్ ప్రవాసంలో ఉన్నప్పుడు 'ఆండ్రూ మార్లన్' ఇవీ డిఫో తన అసంఖ్యాక రచనలకు పెట్టుకున్న, వాడుకున్న కొన్ని కలం పేర్లు. 'యాన్‌ఎస్సే ఆన్ ప్రాజెక్ట్స్ అండ్ ప్రాజెక్టర్స్' అనే గ్రంథంలో దేశాభివృద్ధికి రహదారులు ఎంతో ముఖ్యమని, అనాథలకూ, పిచ్చివాళ్ళకూ శరణాలయాలు కట్టించాలని, కష్టజీవులకు సేవింగ్సు బ్యాంకులు ప్రారంభించాలని, మహిళా, సైనిక కళాశాలలు ఏర్పాటు చేయాలని ఇలాంటి ఎన్నో విషయాలు చర్చించాడు. అది చదివి బెంజమిన్ ఫ్రాంక్లిన్ అంతటి వాడు

ఈ గ్రంథాన్ని రచించినందుకుగాను నేను డిఫోకు ఎంతో రుణపడి ఉన్నానని ఓ చోట అంటాడు. రెండో జేమ్స్‌ను గద్దె దింపి రాజయిన డచ్ యువరాజు విలియంకు డిఫో ఆప్తుడు, సలహాదారుడు, వ్యక్తిగత రచయిత. విలియం పట్టాభిషేక సమయంలో నగరం వెలుపలకు వచ్చి అతనికి స్వాగతం పలికిన వారిలో డిఫో ముఖ్యుడు. 'ఉదారుడు, సజ్జనుడు, మహోన్నతుడు, దయామయుడు మా విలియం' అంటూ తన రాజు మీద ప్రశంసల వర్షం కురిపించేవాడు డిఫో. అలాంటి విలియంను ఇంగ్లీషువాడు కాదనీ, డచ్‌వాడనీ టబిన్ కవి విమర్శించగానే, 'అది చదువగానే నాకు ఓ రకమైన ఉద్రేకం వచ్చిం'దంటూ 'ట్రూ బోర్న్ ఇంగ్లీషు మ్యాన్' అనే గ్రంథం రాశాడు. 'ఎక్కడయితే దేవుడు ఒక ప్రార్ధనా స్థలం నెలకొల్పుతాడో, అక్కడే సైతాను ఒక మందిరాన్ని నిర్మిస్తాడు, పరిశీలించి చూస్తే మనకు రెండో దాంట్లోనే ఎక్కువ భక్తసందోహం కనిపిస్తుం' దంటూ ఆ గ్రంథం మొదలవుతుంది. క్యాథలిక్ చర్చి ఆధిపత్యాన్ని తీవ్రంగా విమర్శించేవాళ్ళను ఉరితీయాలంటూ డిఫో రాసిన 'ది షార్టెస్ట్ వే విత్ డిస్సెంటర్స్' లోని అవహేళనను అర్థం చేసుకోలేక పోయిన ఒక మతాచార్యుడు 'బైబిల్ తర్వాత ఇదే అంత మహాగ్రంథం అంటూ కితాబివ్వటం, తర్వాత నాలుక కొరుక్కోవటం జరిగాయి. 'డిస్సెంటర్స్' చర్చి మౌలిక సూత్రాలను అపహాస్యం చేసిందని భావించి డిఫోను న్యాయస్థానానికి ఈడ్చారు. కామన్స్ సభ ఆ పుస్తకాన్ని తగుల బెట్టవలసిందే అని హుకుం జారీ చేసి, డిఫోకు కారాగారవాసం, తర్వాత నడిబజార్లో స్తంభానికి కట్టేయాలని ఆజ్ఞాపించింది. ఆ రోజుల్లో స్తంభానికి కట్టించుకోవటమనే శిక్ష పడిన వాళ్ళను ప్రజలు కుళ్ళిన కోడిగుడ్లు, కూరగాయలు, రాళ్ళతో కొట్టటం, ముద్దాయిలు ప్రాణాలు కోల్పోవటం సాధారణం. అయితే ప్రభువులు ఒకటి తలిస్తే, ప్రజలు మరొకటి తలచారు. బందిఖానాలో నుండి డిఫో రాసిన 'హిమ్న్ టు ది పిల్లరీ' లోని భాగాలు వల్లెవేస్తూ, అతని ఆరోగ్యం కోసం 'ఛీర్స్' చెప్పుకుంటూ మద్యపానం చేశారు. మూడు రోజులుపాటు డిఫోకు తోడుగా ఉండి హుషారిచ్చారు. పుష్పలావికలు ఆసందర్భంగా ప్రత్యేకమైన మాలలు, గుచ్చాలు చేసి లండన్ పౌరులకు అందచేశారు. ప్రతి పది సంవత్సరాలకు ఒక సారి నిర్వచనం మారిపోతున్న 'మధ్య తరగతి' ప్రజల వాణిని తన పత్రికల్లో సాహిత్యంలో డిఫో ప్రతిబింబింపచేశాడు, ప్రతిధ్వనింప చేశాడు.

రాజకీయ వాదులకు ఎప్పుడూ ఒక జబ్బుంటుంది. ఏదో ఒక విధంగా పదవో, సంపాదనో ఉంటే గాని వాళ్ళు నిదానంగా ఉండలేరని, అది ఏ రాజకీయ పక్షమయినా, ప్రభుత్వమయినా వాళ్ళకు బేధ ముండ దంటాడు. దొంగలు కనీసం మరొక దొంగ సొత్తుకు ఆశపడరనీ, చదువుందా, లేదా అనే విషయం తప్ప మిగిలిన స్త్రీలంతా తనకు ఒకే రకంగా కనిపిస్తారనీ, పిరికితనానికి పరాకాష్ఠ ఆత్మహత్యఅనీ, పూర్తి స్థాయిలో పరిణతి చెందిన మానవ విజ్ఞానానికి ప్రతీక యుద్ధమనీ, అమిత ఔదార్యాన్ని అసహ్యించుకోవటం ఆంగ్లేయులు కృతజ్ఞత తెలిపే క్రమంలో ఒక భాగమనీ అంటాడు. న్యాయాచరణ ఒక్కటే ప్రభుత్వ ధ్యేయమనీ, న్యాయాన్ని సంరక్షించటమే పాలకుల కర్తవ్యం అనీ, దాన్ని విస్మరించినపుడు వాళ్ళు పాలకులు కాదనీ, వాళ్ళ కిరీటాలు, బిరుదులు, భుజకీర్తులూ అంతా డొల్లనీ, పాలితుల సంక్షేమమే ఏలికల పరమ ధర్మమనీ అనేక సందర్భాల్లో డిఫో హితవు చెప్పాడు.

యంత్రంలా సుమారు ఆరేడు వందల దాకా రచనలు చేసినా అవన్నీ కేవలం కుటుంబ పోషణకోసమేనని మనం గుర్తుంచుకోవాలి. అయితే డిఫో రచనల గురించి క్షుణ్ణంగా పరిశోధించిన 'విలియం లే' మాత్రం డిఫో రచనల్లో 254 మినహా మిగిలిన వాటిని మరిచిపోవచ్చంటాడు. అది కూడా చిన్న సంఖ్య కాదు.

జర్నలిస్టు డిఫో జీవితాన్ని 'మిసిమి' పాఠకులకు అందించాలని ఈ వ్యాసకర్త చేసిన పరిశోధనలలో కొన్ని గమ్మత్తులు బయట పడ్డాయి. జర్నలిజం చరిత్రకారులు డిఫోను దాదాపుగా తమ గ్రంథాల్లో విస్మరించగా,

కొందరు సాహిత్య చరిత్రకారులు అతనిని 'మిసిలీనియస్' రచయితల గుంపులో చేర్చారు. మరి కొందరు 'నేరస్తుల జీవిత చరిత్రలు రాసిన వాడు'గా పేర్కొంటే, ఇంకొందరేమో 'డిఫో - రాబిన్సన్ క్రూసో నవలా రచయిత' అని మాత్రం ప్రస్తావించి మిన్నకున్నారు. జర్నలిజం, సాహిత్యంలోని బహుపార్శ్వాలకు ఆద్యుడు, పితామహుడయిన డిఫోకు ప్రపంచ చరిత్రలో తగిన స్థానం, ప్రాముఖ్యం లభించలేదని నా నిశ్చితాభిప్రాయం. రాజకీయ, ఆర్థిక, వ్యాపార పరిభాషకు అర్థాలు, నిర్వచనాలు. త్వరత్వరగా మారిపోతున్న వర్తమానంలో, కేవలం ఒక మతాన్ని నిందించటమే (కనీసం కొన్ని వర్గాలు) దేశ భక్తి అనిపించుకుంటున్న నేపధ్యంలో, జర్నలిస్టులకు జీతం కంటే గీతం ఎక్కువని పత్రికల ద్వారానే తెలుస్తున్న సమయంలో, నిజమైన, అరుదైన బహుముఖ ప్రజ్ఞాశాలి డిఫో జీవితాన్ని, రచనలను మరోసారి క్షుణ్ణంగా అధ్యయనం చేసి, పరిశోధించి పలు వాస్తవాలు బయట పెట్టవలసిన ఆవశ్యకత ఎంతయినా ఉంది. ఇంగ్లీషు, లాటిన్, గ్రీకు, స్పానిష్, ఫ్రెంచి భాషలు, చరిత్ర, జాగ్రఫీ, దేశదేశాల వాణిజ్య స్థితిగతులు ఔపోసన పట్టటం, సునిశితమైన పరిశీలనా శక్తి, డిఫోను ప్రపంచంలోనే నిజమైన, మొదటి జర్నలిస్టును చేశాయి తప్ప 'విశ్వసనీయవర్గాలు' కాదు. డిఫో తో వచ్చిన ఇబ్బందేమిటంటే ఎంతో మందికి మేమే ఇది ముందు మొదలు పెట్టాం అని చంకలు కొట్టుకునే అవకాశం లేకుండా చేశాడు ఇష్టపడి చేసుకున్న భార్యతో 47 సంవత్సరాలు అన్యోన్యంగా కాపురం చేశాడు. ఏడుగురు పిల్లలకు తండ్రయాడు. తన ఈడు పిల్లలు చెమట పట్టని ఆటలు ఆడుతుంటే తాను మాత్రం బాక్సింగ్, కుస్తీ, ఈతల పట్ల మక్కువ చూపించేవాడు. తర్వాత జీవితంలో తన పత్రికలు, రచనల ద్వారా లోకాన్ని ఒక ఆట ఆడించాడు. కొన్ని సార్లు ఓడినా అసలు ప్రత్యర్థిని ఎదుర్కోగలగటం ముఖ్యం ఏ రంగంలోనయినా. ప్రశ్న, పరీక్ష లేని జీవితం వ్యర్థం అని చెప్పిన సోక్రటీసు సూక్తులను బతికినంత కాలం ఆచరించిన వాడు డిఫో. 'జర్నలిజం, నవలా రచనలకు మార్గదర్శి అయిన డేనియల్ డిఫో గురించి వ్యాఖ్యానించటం అంత సులభం కాదు. అతను అంతర్ముఖుడు, అదే సమయంలో బాహ్య వర్తనుడు. రహస్యంగా, అదే కాలంలో బాహాటంగా అతని ధోరణి ఉంటుంది. "బ్రిటీష్ వలస వాద, సామ్రాజ్యవాదాలతో సమానంగా చైతన్య స్వాతంత్ర్యం మీద అతనికి విశ్వాసం" అన్న రెగ్రైట్స్ అనే గ్రంథకర్త వ్యాఖ్యలకు ఎంతో అర్థం, ప్రాముఖ్యం ఉన్నాయి. 'మానవాళికి సంబంధించిన అన్ని విషయాల్లోనూ నాకు ఆసక్తి' అని చాటిన జర్నలిస్టు డేనియల్ డిఫో 1731 ఏప్రియల్ 26న మరణిస్తే, అతని అంత్యక్రియలకు హాజరయిన వారు బహుకొద్దిమంది. అది సహజం!

# మానవత్వం పెంచే సౌందర్యానుభూతి

డా.. తక్కోలు మాచిరెడ్డి

తెలుగులో అందానికి 100కి పైగాపర్యాయ పదాలున్నాయి ఇందులో చాల భాగం వివిధ అర్థఛాయలున్న పదాలున్నాయి. ఉదాహరణకు అమరిక, చక్కదనము, చెన్ను, జిలుగు, పసిమి, పొంకము, పొడిమి, రాణ, వాసి, విణ్ణానము, సొంపు, సొగసు, సొబగు, సోయగము, నౌరు, హొయలు (పర్యాయపద కోశము - ఆచార్య జి.ఎన్.రెడ్డి). మన ప్రాచీనులు అందాన్ని వస్తుగతంగా తీసుకున్నట్లు ఈపదాల్ని బట్టి తెలుస్తోంది

సౌందర్యాన్ని గురించి ముఖ్యంగా మూడు రకాలైన వ్యాఖ్యానాలున్నాయి! వస్తుగత వ్యాఖ్యానం, ఆత్మవాద వ్యాఖ్యానం. సౌందర్యం వస్తుగతం లేదా రూపగతం అనే వాళ్ల తర్కం యేమిటంటే, అందం అనేది రూపంపై ఆధారపడి ఉంటుందని. రూపం మినహా మరేమీ అక్కరలేదు సౌందర్యానికి. రూపం ఆకృతి, అనుపాతం, అనుక్రమం, సమమితి (Symmetry) సమన్వితి, వర్ణయోజన, దీప్తి, కాంతిలాంటి లక్షణాలు కలిగివుంటుంది. ఆత్మవాదులు అనేదేమిటంటే సౌందర్యం పరమ సత్తు యొక్క పారమార్థిక ఐక్యతకూ, సమన్వితికీ ప్రతీక అని. అయితే ఆత్మవాదులు భావవాదులు చెప్పేదాన్ని కూడా కొంతవరకు అంగీకరిస్తారు. సమన్వితిని అందరూ సౌందర్య నిష్పాదకంగానే భావిస్తారు

భావవాదులు, భావాభివ్యక్తే సౌందర్యం అంటారు. సౌందర్యపు ప్రాణం ప్రణవం 'ఇచ్ఛ' అంటారు. భావవాదంలో ఆధ్యాత్మిక అంశాల ప్రసక్తి లేదు. సౌందర్యం వస్తుగతమా, భావగతమా, ఆత్మగతమా అనే ప్రశ్న ఇపుడు అప్రస్తుతం. ఆత్మగతమనే వాదానికి కాలం చెల్లింది. విజ్ఞానయుగంలో ఆది భౌతిక అంశాలను సత్యమనుకోవాల్సిన అవసరం లేదు. సౌందర్యం భావగతమనేది ఒక వాస్తవం. ఒక మనో వైజ్ఞానిక వాస్తవం. అలాగే సుందర వస్తువు లక్షణాలు వస్తుగతంగా పేర్కొనడం కూడా సబబే. ఈ లక్షణాలను వాస్తవిక లక్షణాలు ప్రత్యక్ష కరణం (AESTHETIC FEELING) క్రమంగా చారిత్రకంగా మనిషిలో వికసించింది. డార్విన్ కొన్ని జంతువులలో ముఖ్యంగా పక్షుల్లో సౌందర్య సంవేదన ఉందనేవాడు స్త్రీ పురుషుల మధ్య ప్రేమభావం సంపూర్ణ మానవ చరిత్ర పరిణామం.

మానవునికి మాదిరే మానవుని భావనలకు కూడా చారిత్రక వికాసం వుంది. శ్రమ ప్రభావం వల్ల, వస్తుగత క్రియాశీల సామాజిక సత్తుగా (BEING) మనిషి ప్రభవించినాడు భావనలో వికసించినాడు. సంగీతం విని ఆనందించగలిగే చెవినీ, అందమైన ప్రకృతి దృశ్యాల్ని చూసి ఆస్వాదించే కంటినీ సంతరించుకున్నాడు మానవుడు

అందమైన మానవీకరణల్ని గురించి మార్క్స్ యిలా అంటాడు - "ప్రకృతి పట్ల ప్రేమ లేనంతవరకూ, ప్రకృతి అంటే భయం పోనంతవరకూ మనిషి తన శ్రమతో ప్రకృతిపై మానవీయ భావన - ప్రకృతి పట్ల మానవీయ సంవేదన అంటే, మనిషి తన నైసర్గిక సంవేదన వ్యక్తం చేయనంతవరకూ ప్రకృతికి సంబంధించి అందమైన మానవీకరణలు ఉదయించి ఉండేవి కావు."

"Beautiful personifications of Nature could not arise until therewas love for Nature, until Man has overcome his fear of nature, by his labour PRODUCED human FEELING for nature, the Human SENSE OF NATURE, and therefore also the Natural sense of MAN"

Quoted from the article 'The Relationship Between an object and Aesthtic Feeling' -- Ivan Astakhov in problems ofModern Aesthetics' publishers, Moscow, 1969 (P.177).

మన దేశంలో ప్రకృతి పట్ల భయం కంటే ప్రేమానురక్తి సంప్రదాయంగా వస్తోంది. కాళిదాసు ప్రకృతి చిత్రణ ఇందుకు ఉత్కృష్ట నిదర్శనం ప్రకృతీ, మనిషీ సమరస భావనతో జీవించిన కాలమది. మనిషి ప్రకృతిలో ఒక అంతర్భాగం. కాళిదాసు శాకుంతులంలో ప్రకృతికొక క్రియాశీల సకారాత్మక పాత్ర వుంది. ఇక సౌందర్య నిర్వచనానికి సంబంధించి ఒక హెచ్చరిక. అన్ని నిర్వచనాలూ అసమగ్రాలే. ఒక్కోవాదం ఒకో రకంగా సౌందర్యాన్ని నిర్వచించడం చూస్తున్నాం వాస్తవమేమిటంటే ప్రతి నిర్వచనంలోనూ పాక్షిక సత్యం వుంది.

సౌందర్యం అంటే జీవితం ఎలా ఉండాలో అలాంటి జీవితం అని అన్నాడు నికోలయ్ చెర్నిషేవ్‌స్కీ. ఆయన మానవతావాది. తన సిద్ధాంత వ్యాసం (వాస్తవికతతో కళకున్న సౌందర్యాత్మక సంబంధం) లో ప్రకృతి సౌందర్యాన్ని గూర్చిన తన అభిప్రాయాలు వ్యక్తీకరించారు. ప్రకృతి అందమైనది, సౌందర్య సంపన్నమైనది కళకంటే ఎక్కువ అందమైనది ప్రకృతి అనేవారు ఆయన.

అరిస్టాటిల్ సౌందర్యానికిచ్చిన నిర్వచనం వాస్తవికతావాద నిర్వచనం. ఆయన అంటాడు - "to be beautiful, a living creature, and every whole made up of parts must not only present a certain order in its arrangement of parts, but to be of a certain definite magnitude Beauty is a matter of size and order"

ఇందులో కొంత సరళీకరణ వుందనేది దాచేస్తేదాగని సత్యం.

ఎడ్మండ్ బర్క్ అనే తత్వవేత్త తన సౌందర్య విశ్లేషణకు భౌతికవాదాన్ని ఆధారం చేసుకున్నాడు. అందంగా ఉండాలంటే ఒక వస్తువు తులనాత్మకంగా చిన్నదిగా వుండాలి. వివిధ భాగాలలో వైవిధ్యం చూడాలి ఆభాగాలన్నీ కలగలిసిపోయి వుండాలి, మృదువుగా వుండాలి. దానిఅంగాలు స్పష్టంగా ఉజ్వలంగా వుండాలి, కాని ఘాటుగానూ జిగేలుమనేటట్లు గానీ వుండకూడదు Quoted from problems of contemporary Aesthetics - M Ovysiannikov/Raduga, Moscow (P 99)

హెగెల్ ప్రకారం ప్రకృతి సౌందర్యం కళా సౌందర్యం కంటే కింది మెట్టుది. ఎందుకంటే అందులో ఆయన భావించిన 'Idea' వుండదు కాబట్టి గోర్కీ కూడా ఈ విషయంలో తప్పటడుగు వేశాడు. ఆయన ప్రకటన ప్రకారం ప్రకృతిలో అందం లేదు. మనిషి ఆత్మలో అందం వుంది. ఇది వాస్తవికం కాదు

పోలెండ్‌కు చెందిన సౌందర్యవేత్త స్టానిస్లావ్ ఆసోవిస్కీ తన సిద్ధాంత గ్రంథం (Foundation of Aesthetics (Polish Scientific Publication, Warszawa) లో ప్రకృతిని మూడు రకాలుగా విభజిస్తాడు. ఎ అపరిమితమైన విస్తారం గల ప్రకృతి బి.పరిమితమైన భూతలం, ప్రకృతి దృశ్యాలు, సి.సంఘటిత ఉత్పాదితాలు, జీవకోటి, ఇక్కడ మానవుడ్ని ప్రకృతిలో భాగంగా చూపడం జరిగింది మనం ప్రకృతిని మానవీకృతం చేస్తాము కొన్ని వేళల్లో ప్రకృతి దృశ్యాలు మనకు కళాకృతుల్లా కన్పిస్తాయి. సంధ్య - క్షణ క్షణం మారుతున్న సంధ్య ఎన్నో కళాకృతులకు సమానం కాదా? మనం గొప్ప గొప్పకళాకృతుల్ని చూసి పొందే ఆనందం గొప్ప గొప్ప దృశ్యాల్ని చూసి కూడా పొంద గలుగుతున్నాము.

సౌందర్యాత్మక దృష్టితో చూస్తే ప్రకృతి తటస్థంగా వుండదు. అది ఒక సౌందర్య విలువ, ప్రస్తుత దశలో ప్రకృతిని సంరక్షించేందుకు మానవత సమాయత్తమవుతున్నప్పుడు ప్రకృతి విలువ మరింత పెరిగింది. సౌందర్యానుభూతి ఒక్కటే - అది ప్రకృతి సౌందర్యంకావచ్చు, కళా సౌందర్యం కావచ్చు. కొన్నిసార్లు కళానుభూతి ప్రకృతి సౌందర్యానుభూతికిదగ్గరగా అన్పించవచ్చు. అందుకే సౌందర్య శాస్త్రం అంటే కళా సౌందర్య మూల్యాంకనం మాత్రమే అని అనుకోవడం సమర్థనీయం కాదు. ఈవిషయాన్నే ఝూంగ్ ఝూవ్ ఈవిధంగా వ్యక్తం చేస్తారు. "సాహితీ కృతిబల్ల పై వుంచిన భూతల ప్రకృతి దృశ్యం, ప్రకృతి దృశ్యం ధరిత్రిపై వుంచిన

(A Literary work is a Landscape on the table. A landscape is a literary work on the earth) Quotedby Yevgenia Zavadskaya - Aesthetics and Life (P 116) ఇందులో కొంత అతిశయోక్తి వున్నా, దీని సారాంశం సత్యదూరం కాదనేది మన అనుభవం

సౌందర్యపు తాత్విక పక్షాన్ని పరిశీలించాలంట మనం అధునాతన మనో విజ్ఞానాన్ని పరిగణనలోకి తీసుకోవాల్సివుంటుంది గెస్టాల్ట్ మనోవిజ్ఞానం చెప్పే తాత్వికత ప్రకారం చాలా ఘటనలు ఒకసారే జరుగుతాయి. మార్పు సాధారణం అచలత్వం కంటే; వ్యక్తికీ బృందానికీ ఉందనుకునే ద్వంద్వం లేదు. వైయక్తికత ఒక Structure ఒక నిర్మితి, గెస్టాల్ట్ సిద్ధాంతం ప్రకారం కళాకారుడు ఒక ధోరణికి మాత్రమే గాక, వేర్వేరు ధోరణుల సమాహారంగా కూడా వుండవచ్చు. నెజా ఇంప్రెషనిస్టూ కాదు క్యూబిస్టూ కాదు. అతనికృతిఒక గెస్టాల్ట్ స్ట్రక్చర్. 'ఈదృష్టితో శ్రీ శ్రీ కవితల్ని మనం చూడవచ్చు.

సౌందర్యానికి కొన్ని వస్తుగత గుణాలున్నాయని మనం చెప్పుకున్నాం ఈగుణాలు సౌందర్యానికి పాదార్థిక మూలాలు ఇవేమిటంటే సమ్మేయత (Commensurability) నైష్పత్తికత (Proportionality) పూర్ణత (Perfection) క్రమబద్ధత (Orderliness) సామరస్యం (Harmony) ఇవి వాస్తవిక ప్రక్రియలు, ఈ గుణాల్ని ఒక సుందర సమాహారంగా ప్రత్యక్షీకరించుకునే సంస్కారం ఉండాలి, సౌందర్య సూత్రాల అవగాహన కూడా వుంటూ మంచిది

ఆధునిక సౌందర్య శాస్త్రంలో సమానుభూతి లేక తదనుభూతి (Empathy Or Einfuhlung) అనే పదాన్ని వాడుతున్నారు మనసు ద్వారా తన సంవేదనా స్థితిని బాహ్య వస్తువులోకి ప్రక్షేపించడం, అలా ప్రక్షేపించడం ద్వారా ఆ వస్తువుతో రసాత్మకంగా మమేకం కావడాన్ని తదనుభూతి (Empathy) అంటారు. ఈ Concept ఆధారంగా, సౌందర్యాస్వాదం ఇలా నిర్వచించబడింది. (Aesthetic enjoyment is objectified self-enjoyment' అని, అంటే సౌంర్యాస్వాదం వస్తునిష్ఠీకృత ఆత్మానందం (Lipps) Quoted (సౌందర్య శాస్త్ర కేతత్వ్, పేజీ.105) కాని సౌందర్యం సుఖం కలిగించేదేకానక్కరలేదు. ప్రఖ్యాత సౌందర్యవేత్త రా.భా. పాటణ్‌కర్ అంటాడు. "సుఖదత సౌందర్యపు ఆవశ్యక అంశం కాదని మనం అంగీకరించాల్సి వుంటుంది - కేవలం శారీరక సుఖం కలిగించేది సుందర వస్తువు కానక్కరలేదు శారీరక వాంఛ తీవ్రతరమైనప్పుడు సౌందర్య సంవేదన క్షీణిస్తుంది. (సౌందర్య మీమాంస) (పేజీ.219) పాటణ్‌కర్ రస సిద్ధాంతాన్ని ఆధునిక మనో వైజ్ఞానిక దృష్టితో వ్యాఖ్యానించాడు సంస్కృతకావ్య శాస్త్రంలో స్థాయి భావాలు, సంచారీ భావాలు, సాత్విక భావాలు అని భావాల్ని వర్గీకరించడం చూస్తాం.

సాత్విక భావాలు క్షణిక భావనాత్మక దశలు, సంచారీ భావాల్లో కొన్ని చింత, విషాదం లాంటి భావనల స్వరూపాల్లాగా వున్నాయి. కొన్ని హర్షాది మనో దశల్లాగా వుంటాయి. కొన్ని సంచారీ భావాలు గర్వం, అసూయలాంటి స్థిర ప్రవృత్తులు. సాత్విక భావాల్లో కొన్ని (రతిలాంటివి) స్థిర ప్రవృత్తులనబడతాయి.

భరతుని వర్గీకరణలో కొన్ని భావాల్ని స్థాయి అనీ, కొన్నింటిని సంచారీ అని అనడం జరిగింది. స్థాయీ భావాలు ప్రధానమనీ, సంచారీ భావాలు గౌణమనీ భావించాల్సి వుంటుంది. ఈ వర్గీకరణ కేవలం నాట్యశాస్త్రానికి సంబంధించింది. సార్వత్రిక, సార్వకాలీన వర్గీకరణ కాదు.

భరతుని వర్గీకరణలో మూడు వర్గాలున్నాయి. 1. స్థిర భావన, 2. క్షణిక భావన, 3. భావోద్వేగంతో పాటు వుండే శరీర ప్రక్రియ. భావనలు స్థిరంగా వుండాలి. అందుకని స్థిర భావన అనే చోట స్థిర ప్రవృత్తులు అంటే భావనాత్మక స్వభావ వైశిష్ట్యాలు (TEMPARAMENT) అని భావిస్తే ఈనాడు కూడా ఈ వర్గీకరణ చాల వరకు సార్థకం కాగలదు.

రసాస్వాద ప్రక్రియ అలౌకిక ఆనందం కాదు. జైన ఆచార్యులు రామచంద్ర గుణచంద్రగారు చెప్పినట్లు రసాలు సుఖాత్మకం కావచ్చు, దుఃఖాత్మకమూ కావచ్చు. శృంగార, హాస్య, వీర, అద్భుత, శాంత రసాలు సుఖానుభూతి కలిగించేవనీ, కరుణ, రౌద్ర, బీభత్స, భయానక రసాలు దుఃఖాత్మక రసాలనీ నిర్ధారించి చెప్పారు వారు (రస్ సిద్ధాంత్ డా॥నాగేంద్ర - పుట. 98) ఇది వాస్తవికతకు దగ్గరగా వుంది. ప్రముఖ హిందీ విమర్శకుడు ఆచార్య రామచంద్ర శుక్లా కూడా దాదాపు ఇటువంటి నిర్ధారణకే వచ్చాడు. ఆయన అంటాడు - 'శ్రోత ప్రేక్షకుని హృదయంలో వేదికపైన ప్రదర్శింపబడే భావోదయం కలుగక కేవలం ఆనందం మాత్రమే కలిగితే, సాధారణీకరణ ఎలా సాధ్యమౌతుంది? కోపము, శోకము, జుగుప్సతో కూడిన వర్ణనలు శ్రోత హృదయంలో ఆనందం మాత్రమే కలిగిస్తే ఆ శ్రోత సహృదయుడు కాడనీ, లేదా, కవి ఈ భావాల్ని అనుభవించకనే వాటి రూపాన్ని మాత్రం వ్యక్తం చేశాడనీ భావించాల్సి వుంటుంది. (రస్ సిద్ధాంత్ పే.99)

సౌందర్యాస్వాదం విముక్తావస్థలోనే సాధ్యం. దీనికై కొంతమేరకు అహం నిరసనం (IMPERSONALITY) మానసిక దూరం (PSYCHIC DISTANCE), నిస్సంగత్వం (DETACHMENT) అవసరం. ప్రతిదాన్నీ లాభదృష్టితో బేరీజు వేసి చూసే ప్రస్తుత వ్యాపారయుగంలో సౌందర్యాస్వాదనకు అంత అనుకూల స్థితి లేదు.

మనం ప్రయత్నించి స్థితిని అనుకూలం చేసుకోవాలి. మరి కొందరడగవచ్చు. సౌందర్యానుభూతివల్ల కలిగే ప్రయోజనమేమిటి? అని. దీనికి జవాబిస్తూ నికోలయ్ శిలాయేవ్ ఇలా అంటాడు. "సౌందర్యానుభూతి వ్యక్తి బింబ రూపాయన శక్తిని ఇనుమడింపజేస్తుంది. ఒక మాటలో చెప్పాలంటే సౌందర్యానుభూతి మనిషిని మరింత మానవీయం చేస్తుంది."

# మనోహర రసలేఖలు
# అబ్దుల్ రహమాన్ చుగ్‌తాయ్

– పి. జోగినాయుడు

చిత్రకారుడు తాను రూపొందించిన చిత్రాలను చూచి మురిసి పోవడం సహజం ఇతరులు కూడా ప్రేమిస్తారని చిత్రకారుడు తెలుసుకోవాలి. ఆచిత్రాలను కాని అవే చిత్రాలను సేకరించిన వారు, సంపాదించిన వారు అత్యంత రసవత్తరమైన చిత్రాలను పొందామని అనుభూతిని చెందేవిధంగా రూపొందించాలి. ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన చిత్రకారులు రవివర్మ, నందలాల్ బోస్ అవనీంద్ర నాద్ ఠగూర్‌లు సృష్టించిన కళారూపాలను సంపాదించాలని తహతహలాడే కళా ప్రియులు, కళా సంస్థల వారు ఎందరో వున్నారని మనకు తెలుసు. అటువంటి అత్యున్నత స్థాయి కళా రూపాలను సృష్టించిన మరో చిత్రకారుడు అబ్దుల్ రహమాన్ చుగ్‌తాయ్.

చుగ్‌తాయ్ వేలకొద్దీ చిత్రాలను గీశాడు. ఆయన చిత్ర రచన భావరూపాల సమన్వయం ఎంతో స్పష్టంగా వుంటుంది. అత్యంత నైపుణ్యత కలిగిన సుమధుర మనోహర, రసరూపాలను హిందు, పారశీక సాంప్రదాయాలలో ఎన్నో 'నీటి రంగుల' (వాటర్ కలర్) చిత్రాలను కళా ప్రపంచానికి అందించాడు 'చుగ్‌తాయ్' చిత్ర రచనలో గొప్ప విశేషం, స్పందన కలిగిన రేఖా లావణ్యాలు. అతి సున్నితమైన, సరళమైన రేఖలకు వివిధ రంగుల సమ్మేళనాన్ని అత్యంత మనోహరంగా కల్పిస్తాడు. చుగ్‌తాయ్ రేఖలలో స్పష్టమైన భావన, వస్తువు ఆకృతిలో ఒక విధమైన సరళత్వం స్త్రీ పురుషుల లోని రూప సౌందర్యం, వయస్సు యొక్క సారూప్యతను విపులంగా చిత్రించి, ప్రేక్షకులకు రూపసౌందర్యాలను అందిస్తాడు. సమోన్నతమైన రేఖలు రంగుల సమ్మేళనంలో పారశీక చిత్ర లేఖనా సాంప్రదాయం ప్రఖ్యాతి పొందింది. అబ్దుల్ రహమాన్ చుగ్‌తాయ్ మొదట రూపొందించిన చిత్రాలలో మనకు పారశీక మొగలాయీ సాంప్రదాయం ఎంతగానో కన్పిస్తుంది. 'సహారా ఎడారిలో రాకుమారి' 'పర్షియాగార్డెన్‌లో స్త్రీ' 'సలీం రాకుమారుడు' 'చిరాగ్-ఇ-లేప్' మొదలైన చిత్రాలను ఆయన పారశీక మొగలు సాంప్రదాయన్ని అనుసరించి రూపొందించాడు.

చుగ్‌తాయ్ పూర్వీకులు పర్షియా దేశానికి చెందిన వారు. 1877లో ఆయన ఒక కళాకారుల కుటుంబంలో జన్మించాడు.

పూర్వీకుడు అహ్మద్ మొగల్ చక్రవర్తి షాజహాన్ ఆస్థానంలో ప్రధాన వాస్తు శిల్పిగా పని చేశాడు. ఢిల్లీలోని పెరల్ మసీదు, ఆగ్రాలోని తాజ్‌మహల్ నిర్మాణంలో కూడ చుగ్‌తాయ్ పూర్వీకుల పనితనం వుంది. లాహోర్‌లో చుగ్‌తాయ్‌కి స్వంత ఇల్లు ఉన్నప్పటికీ, ఆయన జీవితమంతా భారత భూమిలోనే గడిపాడు ప్రఖ్యాతి గాంచిన బెంగాలీ చిత్రకారులు నందలాల్ బోస్, అవనీంద్రనాధ్ ఠాకూర్‌లకు చుగ్‌తాయ్ సమకాలికుడు. అందువలన ప్రారంభ దశలో చుగ్‌తాయ్ పురాణ పురుషుల గాథలను బెంగాలీ శైలిలో చిత్రించాడు. 'బౌద్ధ సన్యాసులు' 'అంబపాలీ' 'ద్రౌపదీ' మొదలైన చుగ్‌తాయ్ చిత్రాలు ఈ తరహాకి చెందుతాయి.

అబ్దుల్ రహమాన్ చుగ్‌తాయ్ అనేక యూరోపియన్ దేశాలను సందర్శించాడు. పాశ్చాత్యులు 'లైట్ అండ్ షేడ్' లను చిత్రాలలో రూపొందించడంలో ప్రఖ్యాతి చెందిన వారు. అక్కడి చిత్ర రచనా విధానాలను చుగ్‌తాయ్ సూక్ష్మంగా పరిశీలించాడు. ఈ దేశాలను పర్యటించటం వలన చుగ్‌తాయ్‌కి మరికొంత విశాల దృక్పథం ఏర్పడింది. తర్వాత కొంత కాలానికి అతనికి తన స్వంతదైనశైలి 'చుగ్‌తాయ్‌జం' యేర్పడింది. అప్పటినుంచి అయన కళా సృష్టి, సాంప్రదాయ బంధనాలను చాలా వరకు తెంచుకుని స్వంతశైలిలో సాగింది. 'గ్రాండ్ ఫాదర్' మొదలైన చిత్రాలు 'చుగ్‌తాయ్‌జం' శైలిలో రూపొందాయి. చుగ్‌తాయ్ తాను చిత్రించిన రూపాలతో తన్మయ భావాన్ని వ్యక్తపరచవలసి వచ్చినప్పుడు, మనుషుల రూపాలలో కొంత అసహజత్వం వున్నా, అతి సున్నితమైన

గాలిలో తేలిపోయే విధంగా రేఖలు సృష్టించి, సన్నని నడుములు, పొడవైన ముక్కులూ, లేత చిగుళ్ల వంటి చేతివేళ్లను, అర్ధనిమీలిత నేత్రాలను గీచి, చిత్రాలలో ఒక అనూహ్యమైన తన్మయతను సాధించాడు. ఆయన చిత్ర రచనల్లో, ముఖ్యంగా పసుపు, ఆకుపచ్చ, ఎరుపు పింక్ రంగులను ఎంతో అభిమానంతో ఉపయోగిస్తాడు రాజస్థాన్ లఘు చిత్ర కళ (మీనియేచర్)లో, కాంగ్రా చిత్రాలలో పసుపు, ఆకుపచ్చ,ఎరుపు రంగులు తరచుగా వాడుతాడు. ఆవిధమైన రంగులను మేళవించి మెరిసిపోయే విధంగా నీటి రంగుల చిత్రాలను వందల కొలది చుగ్‌తాయ్ రూపొందించాడు.

అబ్దుల్ రహమాన్ చుగ్‌తాయ్ అనేక చిత్రసంపుటాలను ప్రచురించాడు. 'ఉమర్ ఖయ్యాం రుబాయిలకు' చిత్రాలు గీచి, ప్రచురించాడు. ఇందులో గీచిన చిత్రాలు అత్యంత ఉత్తమమైనవిగా ఇతర కళాకారులు విమర్శకులు కీర్తించారు.

సుప్రసిద్ధ ఉర్దూకవి గాలిబ్ గీతాలకు చిత్రాలు రూపొందించి, 'మురక్-ఇ-చుగ్‌తాయ్' అనే చిత్రసుపుటాన్ని కూడ ప్రచురించాడు. చుగ్‌తాయ్ పారశీక పద్ధతులను ఆకళింపు చేసుకోవటం వలన గాలిబ్, ఉమర్ ఖయ్యాంసం వ్యక్తపరిచిన భావాలకు అనుగుణంగా తన సరళరేఖల ద్వారా, రంగుల మేళవింపు ద్వారా పూర్తిగా న్యాయం చేకూర్చ గలిగాడని కళావిమర్శకులు అభిప్రాయ పడ్డారు.

'నకిష్-ఇ-చుగ్‌తాయ్' చిత్ర సంపుటి (1936) 'చుగ్‌తాయ్ చిత్రావళి' 'చుగ్‌తాయ్ భారతీయ చిత్రాలు' అనే పుస్తకాలను గతంలో ప్రచురించాడు. అనేక భారతీయ పత్రికలలో ఈయన చిత్రాలను ప్రచురించారు. ఇలస్ట్రేటెడ్ వీక్లీ, మాడరన్ రివ్యూలలో మోడరన్ పెయింటర్స్ సిరీస్‌లలో అనేక చిత్రాలను ముద్రించారు.

'వధువు', 'నిరీక్షణ' 'పెండ్లి కూతురు' 'బౌద్ధసన్యాసులు' 'లంబాడి' 'ద్రౌపది' అంబపాళి, 'సహారఎడారిలో రాకుమారుడు' 'గ్రాండ్ ఫాదర్,' 'పర్షియా గార్డెన్‌లో రాకుమారి,' యువకుడు మొదలైన చిత్రాలలోని వర్ణ సమ్మేళనం, రేఖాలావణ్యాలు, రేఖలు ఆకాశంలో తేలిపోయే తేలికదనాన్ని, స్వచ్ఛమైన వాతావరణాన్ని ఈ చిత్రాలలో చుగ్‌తాయ్ అత్యంతనైపుణ్యంగా ఏకాగ్రతతో రూపొందించాడు. చుగ్‌తాయ్ అమెరికా, లండన్, పారిస్, బెర్లిన్ దేశాలలో చిత్రాలను ప్రదర్శించి కళాభిమానుల ప్రశంసలు అందుకున్నాడు. సాంప్రదాయక చిత్ర కళారీతులలో ప్రాముఖ్యతను విదేశీయులకు చాటి చెప్పాడు. ఒక సూత్రానికి, ఒక నియమానికి, సాంప్రదాయానికి చుగ్‌తాయ్ కట్టుబడి వున్నప్పటికీ, ఆయన అత్యధిక చిత్రాలు చుగ్‌తాయిజానికి చెందినవి. చుగ్‌తాయ్ చిత్రాలను ఇతరులు అనుకరించడం కష్టం.

ప్రస్తుతం అబ్దుల్ రహమాన్ చుగ్‌తాయ్ చిత్రాలు అనేక భారతీయ కళా ప్రదర్శన శాలల్లో వున్నాయి. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పురావస్తు ప్రదర్శనశాల (హైదరాబాదు) లో సుమారు 80 చిత్రాలు వరకు వున్నాయి. ప్రదర్శనలో 36 చిత్రాలున్నాయి. సాలార్‌జంగ్ మ్యూజియం, బరోడాలోని పిక్చర్‌గ్యాలరీ, మైసూర్ లోని ప్యాలెస్ మ్యూజియంలో కూడ చుగ్‌తాయ్ కళా ఖండాలు సందర్శకులను రంజింప చేస్తున్నాయి.

1960 - 61 లో పాకిస్తాన్ ప్రభుత్వం చుగ్‌తాయికి గొప్ప సన్మానం జరిపింది. గతంలో ఏ చిత్ర కారునికీ ఇంత గొప్ప సన్మానం జరగలేదనీ ఎందరో అన్నారు. 1974 లో చుగ్‌తాయ్ పాకిస్తాన్‌లో మరణించారు.

అప్పటిలో అనేక భారతీయ పత్రికలు చుగ్‌తాయ్ కళా (ప్రాశస్త్యాన్ని) గూర్చి సంపాదకీయాలు వ్రాశాయి.

# ధ్వని

- పుట్ట మురళీరావు

రౌతు రికాబులు మీద కాలువేయగానే అతని లోతుపాతులు గుఱ్ఱానికి ఆనుతాయట! అలాగే కావ్యరచనా కౌతూహలులైన మన కవు లందరూ అవతారిక, పీఠిక మొదలగు కావ్య ప్రారంభ సూచికలలో తమను గురించీ, రచనకు ఉత్ప్రేరకాలయిన పరిస్థితులను గురించీ చెప్పడం ఆనవాయితీగా వస్తుంది.

తమ తమ సమర్థతలను తెలిపేటప్పుడు కొంతమంది అక్షర యోగులు మిక్కిలి వినయ విధేయతలను ప్రదర్శించినా, కొంతమంది తమ తమ నైపుణ్యాన్ని కుండబ్రద్దలు కొట్టినట్లు చెబుతారు. ఆ చెప్పిన తీరులలోనే వారు ఆ యా రచనలను ఎలా తీర్చి దిద్దబోతున్నారో అన్నది విశదమవుతుంది.

'వాణి నారాణి' అన్న పిల్లలమఱ్ఱి, "నా నేర్చిన భంగి చెప్పి వరణీయుడ నయ్యెద" నన్న తిక్కన, తన గురించి "పోతన నామ వ్యక్తుండ, సాధునయ యుక్తుండ" నని, వినయంతో వంగి పోయిన పోత నామాత్యుడూ ఒక ప్రక్క, 'ఏకైక దిన ప్రబంధ ఘటికా సద్యశ్శతగ్రంథకల్పనుడ'నని ఢంకా భజాయించిన భట్టుమూర్తి, తన అల్లిక జిగిబిగితో సాహితీ మల్లులచే శెహబాష్ అనిపించుకొన్న అల్లసాని, కవితా సనాథుడయిన శ్రీనాథుడూ, శబ్దాన్ని పిండి తేనె లూరించగల తెనాలి, అలతి అలతి తెనుగు పదాలతో అనల్పార్థ రచనా ధురీణు డయిన పాల్కురికి - వీరందరూ తమ సత్తా గురించి వారి వారి స్వభావాల కనుగుణంగా అవతారికలలో చెప్పుకొన్న వారే. అయితే అందులో మనస్సు లోయలను తడిమి గిలిగింతలు పెట్టే పద్యం పాండురంగ మాహాత్మ్యంలో 'తెనాలి' చెప్పినాడు. తన కావ్యాన్ని విరూరి వేదాద్రి నాధునకు అంకిత మిచ్చాడు. కృతికర్త ప్రబంధరచనకు కవిని కోరేటప్పుడు ఆయనకు తాంబూలం, జాంబూనదం, అంబరం మొదలగు మంగళకరవస్తువులను ఇవ్వడం ఆనవాయితీ, విరూరి వేదాద్రి 'తెనాలి'కి తాంబూలాన్ని యివ్వడం మనోజ్ఞంగా సందర్భోచితంగా కృతికర్త వర్ణించాడు.

"పలుకుం దొయ్యలి మౌళి కాంతి కెనయౌ బాగాలు, అయ్యింతి చెక్కుల బోలుం దెలనాకు, లయ్యువిద పల్కులవంటి కప్రంపుబల్కులతో గూడిన విడియం బొసగె నాకుం బద్మనాభార్చనా కలనా పావన హస్త కంకణ ఝుణత్కారంబు తోరంబుగాన్.

ఆ తాంబూలములో నిచ్చిన వక్కలు సరస్వతీ దేవి కొప్పు వలె నల్లగా నున్నవట, ఆకులు ఆవాగ్దేవి చెక్కుల వలె తెల్లగా పలుచగా నున్నవట. మరి అందులో వుంచిన కర్పూరపు పలుకులు పద్మ భవుని రాణి మాటల వలె సుగంధ భరితములయి యున్నవట. ఇస్తున్న తాంబూలము కావ్య రచనా సందర్భములో. అందువలన అందులోని వస్తువులన్నీ రచనోద్దీపకము లయి, సరస్వతీ తాదాత్మ్యమును చెందియుండి ఫలప్రదము లయినవని చెప్పక చెబుతున్నారు. అయితే ఇటువంటి విశిష్ట వస్తువులను ఎటువంటి చేతితో ఇచ్చాడు? పద్మనాభార్చనా కలనా పావన హస్త కంకణ ఝుణత్కారము తోరముగా వస్తున్న చేతితో విరూరి వేదాద్రినాథు డిచ్చాడు. "కూర్చుట నూత్న రత్నమునకుం గనకంబునకున్ దగున్." అందువల్ల అటువంటి పవిత్ర వస్తువును వాగ్దేవీ ప్రసన్నత సందర్భంలో అంతటి పవిత్రమైన చేతితో ఇచ్చాడని చెప్పి, స్వారస్యాన్ని రససిద్ధిని ఇబ్బడి ముబ్బడిగా సాధించాడు తెనాలి!

# 50 Years of Service

## The United Nations Organisation recently celebrated its 50th anniversary. This quiz is dedicated to their long mission to promoting peace and tolerance

## Questions

1) When was the United Nations Organisation formed, and who suggested the name of UNO?
2) To prepare a charter for the United Nations, a conference was convened on April 25, 1945. Where was this conference held?
3) Who said, "The United Nations was set up not to get us to heaven, but only to save us from hell"?
4) Where is the headquarters of (a) the UNO (b) the UNESCO, situated?
5) "The UN keeps the nations talking and the longer they talk the better it is, because the longer is war put off", who said this?
6) When did India become a member of the United Nations?
7) Who shared with a Chinese the first UN Population Award?
8) Who can expel a member of the United Nations?
9) Which is the only country to have been expelled from the membership of the UN, and why?
10) Which are the official languages of the UN, and of these, which are the working languages?
11) Which day is observed as Human Rights Day?
12) Who was described by U Thant, a former Secretary-General of the United Nations as "a woman of all seasons"?
13) The United Nations had declared 1995 as the year of what?
14) Who was the first Indian to make a speech in the UN General Assembly in Hindi?
15) UNO has declared 1996 as the International Year For... ...?

## Answers

1) UNO was formed on October 24, 1945 President Franklin D. Roosevelt of the United States of America suggested the name
2) San Francisco
3) Winston Churchill
4) (a) New York (b) Paris
5) Dr. Ralphe Bunche
6) 30th October, 1945
7) Indira Gandhi
8) The General Assembly, on the recommendation of the Security Council
9) Taiwan. It was expelled mainly to pave the way for admission of the People's Republic of China, it being opposed to the Two China Theory.
10) The official languages are English, French, Chinese, Russian, Arabic and Spanish The working languages are only English and French
11) December 10
12) Vijaylaxmi Pandit, the first woman President of the United Nations General Assembly
13) The Year of Tolerance
14) Atal Behari Vajpayee.
15) The Eradication of Poverty

■ Ehtesham Anjum

MISI/మిసిమి RNI Regd No 45042/90 Telugu Monthly, Hyderabad-500 020 Postal Regd No H/SD/191